# వరలక్ష్మీ త్రిశతి

[ ఖండకావ్యము ]

విశ్వనాథ సత్యనారాయణ

ఓసఖా! ప్రియభార్యావియోగ మెఱుఁగ
నట్టి యోపూర్వసత్కృతీ! యకట! నీవు
కర్మశతకంబు చదువకు! మర్మఘాతి
నీ వెఱుఁగలేవు దానిలోనిదగు —.

# ఉత్క్రమణము

## [కర్మశతకము : ౧వ పది]

నారాయణ! నారాయణ!
నారాయణ! దేవ! లోకనాథ! మురారీ!
నారాయణ! నారాయణ!
నారాయణ! కృష్ణ! విశ్వనాథ! ముకుందా!

నాకనుగూళ్లలో నమరి నావగు కన్నులు చూచుచున్నవా!
నాకుటిలంపుమై నమరి నావగు ప్రాణము లాడుచున్నవా!
నా కని చెప్పుకోను దగినట్టిది వస్తువు నిల్చియున్నదా!
నాకృత మెల్ల నన్ను విడనాడక వెంబడి వచ్చుచున్నదా!

గ్రక్కున యామదండపరిఘాతముచే మఱి దేహమెల్ల ది
మ్మెక్కినదేమొ నా నెచటి వెచ్చట నచ్చటి వచ్చటే పోయిన్
ద్రిక్కక నాదుప్రాణములు నిల్చెనొ తా నిది సూక్ష్మబాధ లే
కక్కట నాకు స్తంభవిషయంబుగఁ దోఁచెడు దేహమంతయున్

పోనును లేచి పోయినదిపో! మఱి యెంతయుఁ గొంటినో సరే!
ఆయువుకొన్న యంతయిన దానిని యిప్పటి కెన్ని నాళ్ళబా
ధాయతి యాతరించినది యక్కట! యెవ్వరు లేనియట్లు నే
నే యయినాఁడ లక్ష్య మిడియించెను నేరుపుగల్గు బ్రహ్మకున్

ఓయి! యదృష్టహీనుఁడ! అహో! ఎరిచూడఁగ రాదొ మాపినా
వోయి! అదే నిజమ్ముగ నెవో యొకయాశలు వేనవేలు, హా
హా! మొద పెంచికొంటి నవి యన్నియు చూడుమ యెట్టులైనవో
నాగొడ లేమొ ప్రాణదలనాబున కింకను స్వస్తి చెప్పెదన్

గోతికిఁ బోతె నున్న దదిగో నను మీరలు పట్టుకొందు నే
పోతిని నేలకోకి, దిగిపోయితిఁ, బోవుచునుంటి నన్ను మీ
రీతఱి బాధపెట్టకుఁడ యీగతి నాగతి నన్ను బోవనీ
కీతను వేల నిల్ప మది నెంచెద రాప్తుఁడుగా సనాప్తులై

ఈనిముసంబుదాఁక గ్రహియించకపోతిన యెంత కెంత కా
శానిహతుండ నైతిఁ గలుషంబులు సర్వము నేన చేసితిన్
నానిలువెల్ల నగ్గి లలనా! దరికాల్పితి వాక్క లిప్తపో
నే ననుభూతికిన్ దగుదు నెంతకు బ్రహ్మ మొఱింగి యోరఁబో

ఇటు లోకులందు సంకటము గొనసియను బాధయటంచు మున్ను దు
ర్ఘటమయినట్టి స్పర్శసుఖం బౌనఁ గూడెను దీనిదేహ మం
తట శవ మందురా ! యిది మదంబున పొందిన నాకుచేత ని
చ్చట శవదృష్టి పొందకనిజంబుగఁ బొందని దేమి పొందుచున్

ఈమెమరొమ్ముపై నొరిగి యే సది యెన్నిదినంబులైనదో
ప్రేయములైన కోరికలు పెంచిన తొమ్మిదిమాసముల్ స్వం
శ్రీయుతముల్ పురస్కృతిని జేకొనె నన్నిది వీడరానిదై
వాయనిదై సుగాఢముగఁ బట్టిన కౌఁగిలి నన్నుఁ దేల్చుచున్

నాకులాంగనసుధాననము చెక్కులద్దనిం
డకట నన్నడ్డుపెట్టకుఁడు మీరు
నాప్రియురాలికంఠము కౌఁగిలించనిం
డీకరమ్ములు లాగఁబోకుఁ డీగు
నాస్త్రీయుగమ్ముపై నన్ నొరిగనిండు వె
న్కకుఁ బట్టి నన్ను లాగకుఁడు మీరు
నాయర్ధతనువువెంటనె సాగుకొననిండు
వలదంచు నన్ను నాపకుఁడు మీరు

ఒక్కయేడాదిగ లేని యున్న దంచు
ముందు వ్యర్థమ్ముగాఁ దలపోసికొన్న
దీమహాశాసనముద్రమ్ము లింకు కొన్న
దీతుదిసుఖమ్ము ననుఁ బొందవింపు మీరు

# ప్రాయశ్చిత్తము

[ కర్మశతకము : ఇవపది ]

ఈయాచారముమాత్ర కాక మఱి యేవే మైథిలీశీల ! యీ
ప్రాయశ్చిత్తము నీ కనాచ్యములు పాపంబుల్ పఠించుఁ ద్విజుం
డాయుర్దాయము కొద్దిలోనె సురలోకారాధనీయాచ్ఛశీ
లా ! యత్యున్నత నీవు నోసి పతిశీలా ! నన్ను మన్నించవే

నీవు వేలుపుటూరి వేవెల్గు రేకవు
కేవలమును మృదాకృతిని నేను
నీవు సదాచారనిష్ఠాయతాత్మవు
కడు దురాచారనిష్ఠుఁడను నేను
నీవు నిశ్చలమనోభావాభిరామవు
సరి చంచలాతిచంచలుఁడ నేను
నీవు స్త్రీరూపమందిన గేహధర్మము
వాకకీతి కొదుగని యులిపి నేను

ప్రకృతి విచ్ఛిన్నమ్ముగా నీవు వికృతి నేను
నా సౌందర్య మహౌఘసంతతులవడును
నేసుకృతశేషఫలమో నాయిల్లు నీవు
లీలగాఁ గొన్నినాళ్ళు వెలిగించినావు

సుమసంవాసితముల్ సుఖాలయము తేజ్యోతిర్మయస్వస్తిలో
కనులం దుండి వినిర్గమించితివొ నాకై దివ్యపూతత్వను
త్రమతాదర్శనకై త్యజించి నను నేతత్పూర్వయోగవ్యతి
క్రము నాలోకము లేగితే మజుల నిర్దాక్షిణ్యాచారింబలెన్

వర్తనచేత నిన్ గొలువనచ్చును మానససిద్ధి దేవతా
మూర్తివి నీవు నాయెడలఁ బొందిన మానుషమైన పేర్మిని నా
కీర్తికి హేతువైన దతికించిన యీయగు కింత త్రెంచి న
న్నార్తికి గింప సౌరపవ నుంటటి నాయెదఁ జిచ్చునెట్టుమన్

నీ విట దివ్యతేజములు నింపితి శ్వేనెలు వార్చి తంతవై
దేవి! పరిత్యజించితివి దీనిని వ్యర్థశరీరమున్ బురా
శ్రీవిన్మృతప్రభల్ గలపరించిన యియ్యాని నేఁటి కింత తే
జోవిగతంబు నింత మధుశూన్యముగాఁ గనిపించు నేటికో !

నియమస్మృతిప్రబోధచ్ఛటలు నిండిన పావనసంబుచేత నీ
కాయము పూర్వ మొప్పనికాయము పూతచరిత్రుఁ జేసె నీ
మాయజితభక్తిభావవిషయం బగుటన్ మఱి నేఁడు మానము మిం
కాయము కట్టె నేను నొకకట్టెను రెంటను దగ్ధయోగ్యముల్

నీయం దే నతిదోషకారి నది కాపి కోపలం దాచి యీ
ప్రాయశ్చిత్తము నాకుఁ జేసితివి తీరా సౌఖ్యమా వేళనన్
నాయా వేషము మానుమా బనులు తేనా నీవు నేనున్ ఘనం
ప్రాయశ్చిత్తము చేసెదన్ జివరి కర్మారంభనిష్ఠాప్తుఁడన్

తొలినాళ్ళన్ యజమానినై పసపు తెత్తున్ గుంకుమన్ దెత్తు చీ
రలు తెత్తున్ సకలమ్ము తెత్తును గరిప్రస్వామి నాసర్వముల్
గొలుపింతున్ యజమానికిన్ బదులు తప్పా! నేఁడు నిక్కమ్ముగాఁ
జెలి! నీ కేమటి భర్తనా! కొడుకునా! చిత్యాగ్నికృద్వ్రతికినా!

ప్రేమారూపము దాల్చి వచ్చినది గౌరీదేవి నాయింటికిన్
నాయజ్ఞానముచేతఁ గొన్నిదినముల్ నా లేమిచేఁ గొన్ని నా
ళ్లాయానందతగంగపూజలకుఁ గానైతిన్ జ్ఞాతాజ్ఞానుఁడై
శ్రీయుక్తుం డయినంతలోఁ గుపిత చేరెన్ గౌరి కైలాసమున్

ఛద్మాకారము పూని దేవత లుదంచత్ప్రేములై మానవుల్
సద్మంబుల్ మఱి సేరవత్తురు తిరస్కారమ్ము విజ్ఞానసం
పద్మత్తుల్ పొనరింత్రు వారిదెస దౌర్భాగ్యుల్ మనుష్యుల్ క్షుధా
సద్మల్ సౌరపథానుగుల్ సురలుధీస్రంసుల్ హతుల్ మానవుల్

# దహనము

[కర్మశతకము : 3వపది]

నిశలును బవళ్ళు సుఖము పండించుకొన్న
నాపొలము భగ్నమన్న మంటఁ బడిపోయె
ననిలజవమున సురసుర లాడిపోయె
మంటపెల్లున మలమల మాడిపోయె

ఇది యొకనాఁడు సోగతన మేచిన ప్రేమమనోజ్ఞదీపికా
మృదులవిచిత్రవీథితులు మించిన సంస్మృతిదుఃఖభాగ మె
ల్లఁ దిగిచు దివ్యసౌఖ్యములు లాడిన మోహానసౌధ మిప్పు డి
య్యది చితివహ్నిలోఁ జిటపెటారవభీకర మయ్యె నేఁటికో !

పూఁడుబాసలలోని ముగ్ధభావనము లేరి
కొని తెచ్చికొని దాచికొనిన చోటు
అల దిశాంగనల విహారార్ద్రి యునీ
చికలలో సొగసు తేల్చికొను చోటు

ప్రాగ్జన్మసంస్కారపరిణామపరిణాహ
వాఁచి కౌఁగిటఁ బూనినట్టిచోటు
నాతనూసృష్టిలగ్నాఖిలాణువులలో
నమృతసేచన చేసినట్టి చోటు

కోరి పితరు లాశలు పెంచుకొన్న చోటు
నా సగోత్రులు మరియాద నాటు చోటు
నాకు నిలువేల్పు లభిలాష ననచు చోటు
ఈగతిఁ జితాగ్నిభస్మమై యేల పోవు ?

ఇచటఁ దర్పితులై సవేప్సితంబులు గన్న
పితరు లెంత కృతఘ్నమతులో కాని

ఇచటఁ బూజితులైన యిలువేల్పుల సమూహ
మయయొ తా నెంతనిర్దయమొ కాని
ఇట సమర్చాప్రీతి నెసఁగి దీవన లిచ్చు
ద్విజకోటిమన సెంత బిరుసొ కాని

నాపూర్వజన్మపుణ్యం బెంత యల్పమై
నదియొ హీనాతిహీనంబొ కాని

# త్రిశతి

నాకనుల నెట్టమొదటన నాకనీక
నామసంమార్ధమైన యీంభాగ మెల్ల
పెటపెడ దహించికొనిపోన మిడిపిపడెను
గ్రుడ్లు పెట్టుక నేఁ జూచుకొంచు నుంటి

ఇది నిన్నదాఁక నామెదమీఁద హత్తించు
కొనిట్టి మందారకుసుమమాల
ఇది యింతదాఁక నాహృదయసంగతమహా
నందనిర్ఝరీశీకర త్తరంగ
ఇది నేఁటిదాఁక నా మదిలోన వెలిఁగిన
దీపించి నా స్మృతదీపకలిక
ఇది యింతవఱకు నాయీమైగగుర్పాటు
కాంచిన చల్లని గాలికొంగ

ఈచితావహ్నిఘోరజిహ్వికల చేత
నాకఁబడి రేకులను జీలినదియు బిందు
వితతి శోషించినదియు దీప్తిని లయించి
నదియు శైత్యంబు హరియించినదియు నయ్యె

ప్రాలేయగిరిసుతాఫాలకుంకుమ రేఖ
రాణించు శుక్రవాసరవ్రతంబు
నానావయవఘట్టనముల గోర్చిన ద్వాద
శాదిత్యకృతనమస్కారనియతి
గాయత్రితోఁ బాటుగాఁ జూచుకొన్న సాం
గకనవగ్రహపురస్కారనిష్ఠ
బ్రహ్మార్పణంబుగాఁ బ్రతికార్యమును పూ
నిన సర్వదైవసన్నిహితబుద్ధి

కేవలము మత్పురాజన్మకృతమహాఘ
బలమునకె లొంగిపోయె నాబలము బుస్సు
మన్న త్రాచుల నాల్కలకన్నఁ గ్రూరగ
ఫణితిగల యీచితాగ్నిరూపంబు తాల్చె.

తనప్రేమలోతు చిక్కని దృగంతచ్ఛటా
శ్రీఁగాని నోటితోఁ జెప్పలేదు
తనదుఃఖభార మెల్లను నిశ్చలాపాంగ
ములఁగాని నాల్కతోఁ బలుకలేదు

నాదైన దోషసంతతి తెప్పవాల్చుట
తేఁగాని జిహ్వాగ్రోఁ జెనకలేము
తానముహోనంగన నింతని మాపుఁ దళతళ
గాలికిగాసి మాట నూపనేకు

ఈమె యోగిని కనఁలందె నెల్ల బ్రిదుకు
బ్రిదికెఁ గనులందె ప్రాణముల్ వదలిపెట్టి
ఆకనులనీ పిరె నోము యగ్ని యిట్లు
ఆజ్వలజ్జిహ్వ వెూపకలాడుచుండె

కూటికి లేక చిక్కులుపడ్డనాళ్లలో
నీ మేను నిలిపిన దీమెకొఱకు
అతిని యోగపుముష్టి నఖిలమిత్రుల ధనం
బెదఁ గుంది కొనినది యీమెకొఱకు
అస్నసా క్లాత్మహాత్మ్యబుద్ధి పెడఁద్రోసి
యిలమీఁద బ్రదికిన దీమెకొఱకు
గదపూర్ణమైన నాకాయంబు బహుయత్న
మేవి రక్షించిన దీమెకొఱకు

ఇపు డెవరికోసమో కాని యేను బ్రదికి
యుండు టవు నవు నాపిల్ల లుండినారు
వారు నాప్రాణములయందు బల్లు లట్లు
లమకుకొన్నారు నాచావు నడ్డపెట్టి

మనసువికారమెల్లను నాకె కల దట్టి
నన్ను సమ్యక్ఛీలు తెన్ను నడపి
లక్ష్మి నాయెడఁ జంచలాతిచంచల అట్టి
నాయిల్లు భాగ్యవంతంబు చేసి
నట్టిసిరసబుద్ధి నట్టినన్ను గసోత్థ
పథముల సత్కవీశ్వరునిఁ జేసి
గదపూర్ణదేహు న న్నెద నాఁడి నాకు ని
ర్గమన కారోగ్యభాగ్యంబు నొసఁగి

ఇతరు లెవ్వరు నెఱుఁగని యీరహాస్య
ఫణితి నను నేలుకొనిన నాపట్టుమహిషి
నిర్దయునిచేత నాచేత నిహత యయ్యె
అనిలముఖమున స్పృష్టఘోరాఘుచేత

పగనుతూ నాశుమసకిని జిహ్వాలు చాచు
సాగుగుకునికి జోగహాంగు లనుము

కృధ్రిలభ్యము పుణ్యకృత్కపాంచము కోరు
భూతనాథున కన్నిజోతి లనుము

దానాతినాంఛాయతాపబుద్ధికి బ్రాహ్మ
ణశ్రేశి కొక్కపరిణామ మనుము

అత్యల్పము శనాత్తముగు ధన మ్మాసించు
చండాలతతి కొక్కదండ మనుము

ఈశ్నశాగస్థచాయసగృధ్రిగునక
సంతతికి నొక్క వే నమస్కార మనుము
ఏవిచిత్రపు పాణిసముహమా ! పు
నఃపునఃపరిణామము పూనినాడు మీరు

# సంచయనము

[ కర్మశతకము : ౨వ పది ]

ధ్యానించుచున్న గాయత్రీమహాదేవి
యపరాధమున నెత్తి నణఁచినట్లు
పూనియున్నవ్రతంబు పూన్కి భగ్నము చేసి
కాన శనైశ్చరుఁ డాఁచి కొట్టినట్లు
అసదుపస్థితుఁడు మార్తాండదేవుఁడు నన్ను
నీనాస్తికుని విగ్రహించినట్లు
తల్లి యపర్ణ విత్తక్రీతభూదేవ
తాపూజలను గాలఁ దన్నినట్లు

అణఁగిపోయితి గిలగిల లాడిపోతి
లొంగిపోతిని దల పగులంగఁబడితిఁ
బంచభూతములార! యీప్రాణమున్న
శవము చూచితిరే యొల్లు సాఁగుచుండె

ఒకనాఁడాతనుఁగూర్చి పరీక్ష యిడ నే నోఁ తన్వీ! నే చచ్చిపో
నకటా! నీవును జచ్చిపోనొదవఁ జేసె యుస్నఁ నిశాతంబునై
చకితంబై చను చూపు చూచినది లజ్జాహీనుఁడనై నేన యూ
గక ప్రాణంబులు మోయుచుంటి బహుభాగంబైన యీ మేనితో

ఈ చండాలుని యిల్లు చల్లుకొని నీయీ పేరిశవహస్తవస్త్రంబుల్
వే చల్లార్చుక బొగ్గు లెత్తికొని నిర్భీతిన్ జనన్ నే సుఖ
శ్రీ చండాలుఁడ నింటి కేగి నిశ నిద్రించన్ జితాంగత్రుణా
బాచారం బెటు సాఁగు నిప్పటికి నీయందే సనతాంకుతిన్

ఏమో నాయెద పేరిమ సన్నగిలినట్లే యెంచుచున్ నీకు మం
దో మాకో యెదియేని నే నొసఁగనిన్ దోసంబు లెంతెంతు నే
నేమో నీ కఖిలమ్ము సైనగతి నట్లే నీమనస్తృప్తిగా
నీపై నీతుదికర్మ చేసెదనె తన్వీ! చేతులారంగనై

తల కొరివి పెట్టి రక్కరింపులకు నీవు
బ్రతికియున్నప్డు చాలనిభర్త గుతఁడు
తల కొరివి పెట్టి గక్కరింపులకు నేల
బాసినప్పుడు చాలిన భర్త నేను

చెల్లఁగనీక నీసుఖము చింతలు బాధలు పెట్టిపెట్టి నే
నెల్ల విధంబులన్ బొమిక చేరితి ప్రాణము శోష పొంది నీ
వుల్లము కూరి నే బ్రతికియున్న దినంబుల నేఁడు దుఃఖినై
యెల్ల విధంబులన్ బొమిక దేరుచునుంటిని నిక్కువంబుగాన్

శ్రమ పొందువేళ విశ్రాంతి నాజన్మమై
సాగిన దిది తలఁగోని బొమిక

సద్వంకషముగ వత మర్మ్మని తాపమ్ము
త్రోసిన దిది మొహజన్మ్మవెన్మ్ము
సుఖమార్గమునకు భాసురసరిబాహుళ్య
యూరాజిత నిర్మ్మి మొముకదోయి
సంవాహనాత్తలజ్జాముగ్ధ మూరుద్వ
యంబుఁగోనిది యిది యస్థియుగము

ఆసుఖానేహములఁ బోల్చనైతి నీనిఁ
గుపితవై యెంత తరిమించుఁ గొంచు వచ్చె
అంతులేని మహావ్యాధి నాశ్రయించి
సాఁగి నాయెట్టయెదుట సాక్షాత్కరించె

నిర్జీవాస్థిచయంబు నిన్నెడఁదఁగో నిండింపకో నైన నం
తర్జాయామధుభావ మేఁచుకొననైనన్ మానసమజ్జాస్రగం
తర్జృంభోల్బణ మూని నాకు నయనాంతప్లావితప్రోక్షి జ్యో
తిర్జన్మాకృతి తాల్చి శుష్క పలితాస్థీ! దగ్ధబీజాకృతీ!?

పరిశాంతాస్మదుదారహృచ్ఛ్రుధిరధారాసంప్లవనూత్న రీపై
చ్ఛ్రుశుభాళితనూ రీపై క్షణములో నాశానిరాశాద్వయీ
సశ్రద్ధానుతిచేతు నే మదభిలాషానద్విశుష్యద్ఘనా
స్థీ! శ్రీభైరవకాలరుద్రగతవాసీ! దగ్ధజీవాకృతీ!

నీపయి మాంస మాయెడన నెత్తురు నాపయి నేదొ యేదియో
ఆపయిఁ జన్మ మిట్టు లయినట్టిది నాప్రియురాలివేను నీ
పీపలితాస్థి వల్లభ సుమేశ్వరకంఠవిభూషణాది నా
హా! పరిపంచితక్రియను నైతని సాయను మొండిబ్రహ్మకున్

# నిత్య కర్మ

(కన్నశేఖరము : ఏనపది)

మునిసి మూఁడారుసరియేండ్లు బ్రదికి చచ్చి
నట్టి వారికే కానులు ముట్ట వచ్చు,
మూఁనపదిరేండ్లు నిన్ననో మొన్న నిండె
మునరి కానులు నెగబడి ముట్టు నీకు

బ్రదికినవాళ్ళనైన తెగనా! అతివిరక్తమురాల వీవు, నా
కిది వలె నంచు నా తెరచి యెన్నడు కోరఁగలేద నన్ను, మీ
కెది మఱి యిష్టమో అదియె యిష్టము నాకని సర్వవాంఛ లో
నదిమితి నేనయ్యె మిగులునట్లుగఁ జేసితి నప్పు డిప్పుడుఁ

తీరనికోర్కెఁబిల్లున గతించిన ప్రేతము పంగువానునా
కారము గాఢవిలతనుకాంతియుఁగా నొకనాఁడు కెక్కటింతో
దూరముగాఁగఁ బతులను తోలునట్టా మూఁతీరు లేని నీ
తీరినయొల్ల కోరికల తీఁసితీరుట యెట్లు కల్గెనో ?

వెలగల చీర లేదు, పతి పెట్టిన సొమ్ములు లేవు, తల్లిదం
డ్రులు కొనిపోయి యిచ్చినది రూకయు లే, దని నే నటంచు నీ
వలయవు, నేను దుఃఖపడినప్పుడు శాశ్వతమౌ ధనంబు మీ
రలు కల రంటి వన్నిటికి రా! అది యోగిని మాట చెప్ప కే

తా గృధ్రం బిడివో శ్మశానబలిమీఁదన్ గాని కూర్చుండ, దం
దేగానీ తిన, దాడనీయ దొకరీతిన్ వాయసశ్రేణికిన్
రాగాపేత, త్రయీశిఖాపరిణతార్థవ్యక్తవిత్రాజ్ఞ ఆ
నాగేహేందిర తృప్తిప్రీతిద ద్విజసంతానంబు భక్షింపుమా!

నా ప్రాణమ్ములకన్నఁ బ్రాణమగు కాంతం వెచ్చి హాహా! శ్మశా
నప్రేతాకృతి గృధ్రవాయసముఖాంధఃప్రాశనం జేసి ప
క్షిప్రాశమ్మున నామెసద్గుణములన్ జింతించు చే నుంటిగా
నీ ప్రాణాధికతోడఁ బాపు టెఱుఁగన్ నే నెంత రక్షోమతిన్.

# సపిండీకరణాషఘం

[ కన్నెశతకము : ఉపపది ]

రాష్ట్రంబు లేలని రాజులు మత్పూర్వు
లారాజులకు రాజు లైనవారు
నిరతాన్నదాత లాదొరలు వారిండ్లలో
నట నన్నపూర్ణ లైనట్టివారు
ఏకచక్రాంకితు లేకభోగులు వార
లాయింద్రులకు శచు లైనవారు
సతతదానక్రియారతిశాకృతులు వార
లవ్వారి కదలిక లైనవారు

మాపితామహుండు, ప్రపితామహుండు, జ్ఞాత
నామమాత్ర మా ప్రప్రపితామహుండు
దివ్యులు వసురుద్రాదిత్యభవ్యరూప
లరుగుదెంచి రీద్వాదశాహమ్ము వేళ

ఈమిగిలినామె మాకుపిన్నానుపో తన
జీవితముగూడఁ ద్యజియించెఁ జిన్ననాఁటి
నాచదువుకోసముగను మానాయనమ్మ
శ్రీతరుగువోని యానాఁటి చివరిరోఁజి

మాయక్కగారల నుగపించి పసినాఁడు
వెన్నలు పెట్టి మేపినది నన్ను
అనుదినమ్మును బుష్టి నర్థించి నల్ల చే
సిన చేతిజడ్డు రాచినది నాకు
తనపెద్దకొడుకుసంతానమ్మ చిరలబ్ధ
మని వేయికనుల కాఁచినది నన్ను
నాకునై గుంటగుంటల నీసు దాఁపి క
ష్టాలెన్నియోని పడ్డది భృశమ్ము

నాకుఁగాసె ప్రాణము విడిచినదియుఁగూడఁ
దుదకు నే చాలనాళ్లు లావుని మొగమ్ము
మరచిపోలేదు నేఁడు ప్రమాదపడితి
నేండ్లతో స్మృతిశక్తి క్షీణము పోయి

ఆమె యాదిత్యమూర్తి నీ వంగన! వసు
రుద్రమూర్తివి నాగిద్దఱును మహద
కృతమహాత్యాగమూర్తులు కేవలమ్ము
నిద్దఱొకచోట నుండుటకే తగుదురు.

అంత స్స్తంభితబాష్పలోచనుఁడ నీ యాయుర్నిగన్యాధా
నాతవ్యాధిఫలంబు పొందితి తుది కిట్లు యోచ్యయుంజాలకే
చింతింతుఁగా మఱి యెద్దు నేనియును నీశీలపరిభావాత్తముల్
శాంతమ్ములల్ సుకృతార్ఘ్యముల్ కలుషితక్లాంతమ్ము గానోకదే

నీ వతికష్టజీవినివి, నేను మహాదురదృష్టవంతుఁడఁ
దీనలుచుట్టు కష్టములు దీరెను నీ కిఁక, నేను వట్టిమ్రో
డై వడి కెంపకుఁగా పగిలి ధా మ్మని క్రీలు మానో విసుమ్మహా
జీవములందు మాటిడి విచిత్రపు పిచ్చితలల్ చిగుర్తునో

# గోదానము

[కర్మశతకము : ౭వపది]

అగ్నిమయ మమృతమయ మఘ
మగ్నులకు సముద్ధరణము మంథానము ని
త్యాగ్నుల సుకృతంపుఁగడలికి
ప్రాగ్నతమత్పుణ్యరాశి పండిన దిట్టై

ఇది యాదవగోవ్రవతె ను
న్నది కృష్ణునిచరణముద్ర నాటిన దీయా
నుమరందు రాధసవతికిఁ
బదనగు చూపులను గనులఁబట్టెదు దువలన్

గోలోకమునుండి సనా
శ్రీలాంఛనమూర్తి నీదు సేవాలోల
ప్రాలేయశిశిరకరుణా
వ్యాలంబిమనస్క యగుచు వచ్చిన దిటవున్

ఈ నాపురాకృతతపఃప్రభావదీ
ప్తాశేషపుణ్యపరిపూతమూర్తి
యీగోవు పుట్టిన దెచటనో పెరిగిన
దెచటనో యింక తా నిద్యోజూనకుఁ
గైవసమై పెంచఁగాఁబడు నెచటనో
బ్రదుకులోపలి పుణ్యభావ మెల్ల
ఒకట యీనామము మేమో మనదై మన
కల్పించి చనుచున్న దనఘమూర్తి

తన బ్రదుకునెల్లఁ గడపిన జనుల కేమొ
వట్టిశాశ్వతమైన సంపత్తు నొసఁగి
మన తన పురాతనంపు సంబంధ మేమొ
తన బ్రదుకులోని పరమార్థ మరిచె నీకు

ఈనతపుణ్యమూర్తి కృపయెత్తిన వేలుపుఁ బల్లపూళ్ళ మా
గానిపొలంబు పంట కొదుగక ఐశ్వమైనదివోలె నెంత పు
ణ్యానికి నైతినో కృతమహాఘపరంపరమధ్య వచ్చి త
న్వీ! నిలుచుండె వేలుపుల నేలకు నిచ్చెనఁ బట్టినట్లుగన్

అశ్రులము పున్నె మొడ్డిగిలినట్లుగ ముగిసి నిల్చియున్న స
స్మృతి శోలిచూపు పెయ్య శోకమాదిరిగా ననరాకుగాని నీ
బ్రతికినవాళ్ళ నాసుఖము పండిననాళ్ల పవిత్రమైన నీ
వితరణబుద్ధి నైతరించి పెట్టిద మాగఁగఁజాలదా! సఖీ!

అమృతము నిగ్గు మై మెసఁగు నా విధి దానపు సేటిపుక్కు పు
చ్ఛ మనుసరించి యీర్ష్యాజుఁడు చాచిన చేతికి సంస్పేస వే
గమునసుచుండె వైతరణిగట్లుల దూఁకగఁబోవునట్లు నీ
విమలతరంపు శీం సుది చింతకు మొంతప్రాప్తికేనియున్

సడలీ! నాసుకృతంబు పండినది యీప్రష్ఠోహిగా నీను నా
కడసారిన్ బోసరించు సేవ యింకెగో కైకోవె ప్రేతాధ్వమున్
బడి పర్వెత్తెసు నాసదిన్ బడవగై సాలించు నీతల్లి విన్
వడి నాయూహాలు నీని కెత్తు తెరచాపల్ కగ్గ చుక్కానిగన్

నా బ్రతుకౌనంటి బ్రతుకు లంతములు లేని
వెన్నియైనను బ్రతికి మా తేనిఫలము
ప్రకృతిపరపూర్తి యీయావు బ్రహూను బ్రదుకు
వంధ్యశీలవు సిద్దైన బ్రదుకు బ్రదుకు

కదలు వెనుగాళ్లు లూఁగు తోఁకయుచు చలిత
రమ్యపృష్ఠంబు నూఁగెడు శ్రవణములయు
శృంగములయు కొఁసల్ కనిపించుమూర్తి
తరలుచున్నది యీఁమె వైతరణి దాఁటి

# గౌరీపూజ

[కర్మశతకము : లవపది]

ఉన్నదే యువతు లగుచున్నయందలు ఫాల
బాలనీహారాంశుపలితబింబ
లున్నదే వెలుఁగు లందున్నవన్నియు నిడా
నిభృతపింగళమధ్యనిర్గమనములు
ఉన్నదే మహిమ లందున్నవన్నియుఁ ద్రిలో
కనమస్క్రియాసమాకర్షణములు
ఉన్నదే వినతు లందున్నవన్నియు విశ్వ
నాథనీరజచరణార్పితములు

పరిశయరహితగౌరీలోకములు శివాన
వీనపాదవిన్యాసలాక్షానతాంక
కృతనవాలంకృతులు నీకుఁ గేవలముగ
లలితవిహారణావాసభూములుగ నగుత!

అవిచిత్రమైన వాయువులు నిరుద్ధని
శ్వాసనిర్వృతనైశ్చల్యవిధులు
అవిచిత్రమైన క్రొంబువుతావు లాఘ్రాణ
పర్యాప్తవేదు లపార్థివములు
అవిచిత్రమైన ధ్వనివిశేషములు బ్ర
హ్మకపాలరుద్ధానిలాగతములు
అవిచిత్రమైనట్టి యాకృతు లతిదృష్ట
లాజృంభణము లతీతతైజసములు

ప్రియాహితశోకములు నచంద్ర
మఃశిశిరచారుచంద్రికామంథరప్ర
శాంతకాంతిమంతమ్ము లచ్చముగ నీకు
లలితవిహరణావాసభూములుగ నగుత !

అట నాశ లే దున్నయది నిరాశావిష
యంబు నిస్త్రైగుణ్య సుస్మృతమయము
అట బాధ లే దున్నయది పాంచభౌతికం
బది యేను సహజబాధానహంబు

అట్టి మోహాతే నున్న యది యమోహాత్మకం
జ్ఞానదవిషయ మనాదిలయము
అట్టి లేమి లే దున్నయది యందు కలదా న
హేతుచే నెచటగా కల్పించినయది

ప్రళయరహితగాఢాలోకనములు సనాత
నములు సచ్చిదానందవాటములు భర్తృ
జనమనోఽభిరామనివాసములు నీకు
లలితవిహరణవాసభూములుగ నగుత!

అడుగడుగునకుఁ జివురాకు లూచిన గాలి
వడి వేదశిఖ లూను కశిని చెట్లు
చెట్టుచెట్టున నీడపట్టులందున శాల
చంద్రమణులు శివాసదృశసతులు
సతిసతివాక్కున శ్రుతిమహార్థముగ
వ్యాఖ్యానములు గౌరివైభవములు
ప్రతివైభవమున నేత్రనిమీలనములు స్వా
త్మనిమ్నవికాసముల్ తన్మయతలు

ప్రళయరహితగౌరీలోకములు సమాగ్ద్రి
మసృణాహరిద్రమృగకుంకుమపరిలిప్త
సర్వశృంగాటకమ్ము లచ్చముగ నీకు
లలితవిహరణవాసభూములుగ నగుత!

ఉష్ణశీతాంశుల యుదయాస్తములతోడ
నైన కాలవిభాగ మందు లేదు
ప్రాక్పశ్చిమాదికవ్యవహారనిర్దిష్ట
మైన దేశవిభాగ మందు లేదు
సత్రమిత్యాదికించిత్రాగ్యపార్థవా
క్యముల మిథ్యాచర్చ లందు లేవు
విషయవిషయ్యాది వేద్యాదిదృగ్దృశ్య
ద్రష్ట్రాదికములు భేదములు లేవు

పరిశయరహితగౌరీలోకములు గుణపరి
హీణములు సత్ప్రధాననిర్వాణములు ని
శాంతబ్రహ్మలయమ్ము లచ్చముగ నీకు
లలితవిహరణవాసభూములుగ నగుత!

మొరసినట్టిది యందు మొరసినట్లే యుండుఁ
గానతుమ్మెద రొదవోని యులివు

కురిసినట్టిది యందుఁ గురిసినట్లే యుండుఁ
దరి లేఁతనుంచు తుంపురుల జల్లు

సాగినట్టిది యందు సాగినట్లే యుండు
గాఁజువారిన సన్నజాజితావి

కాసినట్టిది యందుఁ గాసినట్లే యుండుఁ
వెలిదిక్కునైన చందురునివెలుఁగు

ప్రళయరహితగౌరీలోకములు బెడంగు
లొలయు తలరింపుకల తొలివెలుఁగు సాఁగి
చాలుకట్టిన మేలిపొలాలు నీకు
లలితవిహారణవాసభూములుగ నగుత!

అట జన్మజన్మాంతరాజ్ఞానకృతఘోర
లీనపాపములు జల్లించినట్లు
అట నకారణఫలావాప్తికందిన మహా
నేకపుణ్యములు సంఘటించినట్లు

అట నైకదైహికోద్భటదుఃఖపరిణామ
విధి చేతితోఁ దీసివేసినట్లు
అట సచ్చిదానందమైన బ్రహ్మము నిరా
దృతమాయచేఁ గన్ను తెఱచినట్లు

ప్రళయరహితగాఢలోకములు విధాత
జానుషోపాత్తదుఃఖవాసనలు కమల
మృదుపవనవీచిచలత్సంపదలు నీకు
లలితవిహరణావాసభూములుగ నగుత!

అచటి శుద్ధశ్వాసనిచయంబులందుండి
అల్పలోకప్రళయములు కలుగు
అచటి ముక్తశ్వాసనిచయంబులందుండి
అల్పలోకపు సృష్టు లవతరించు
అచటి నేత్రనిమీలనానందములనుండి
భువనముల్ మోక్షాధ్వములు గమించు
అచటి లీలామోహనాపాంగములనుండి
భువనంబు లజ్ఞానమున మునుంగుఁ

బ్రిశయరహితగాఢాలోకములు సమస్త
భువనతతిసృష్టిలయహేతుభూతములు వి
శస్తఘోరానుదత్తమోక్షములు నీకు
లలితవిహారణావాసభూములుగ నగుత!

అవికారము వికార మచటి తుమ్మదమోహిత
కేలిక యగు తొలిగొన్దుఱింకె
అవిభిన్నము విభిన్న మచటి గారీమూర్తి
కాదిశివాకారమైన జ్యోతి
అద్వైతమును ద్వైత మానిశ్వసంబుల
కల ధర్మమూల మైనట్టి విద్య
అవియుక్తము వియుక్త మాచోటున కతివి
చిత్రివహా వైధసస్పృష్టి యెల్ల

బ్రిశయరహితగారీలోకములు విలీన
వృక్షబీజవత్తతకృత్స్నసృష్టిగర్భి
తాచ్ఛవిజ్ఞానమయము లందములు నీకు
లలితవిహారణావాసభూములుగ నగుత!

నిత్యసౌమంగల్యవిభృతమూర్తి ని నిన్నుఁ
పాలించుఁగాక సౌభాగ్యగౌరు

అతిలోకదివ్యశీలాభినందిత నిన్ను
లాలించుఁగాక కల్యాణగౌరు

అమితనిర్మలమురాలవైన సీమంతినులో
నటియించుఁగాక ఆనందగౌరు

విమలాచ్ఛవిజ్ఞానవీథిలోపల నిన్ను
రూపించుఁగాక చిద్రూపగౌరు

మద్వియోగవ్యథాదూయమానహృదయ
నీరజను భవ తనయాకుమారరక్ష
ణాతురమనోంబుజాతను నాదరించి
యాది మోదార్చుఁగాక ని న్నాదిగౌరు

# కృష్ణార్పణము

[ కర్మశతకము : నవపది ]

శఫరీవిలాసపుచ్ఛత్రిఘాహాతలుర
తఱ-మరిపాధోఁఉచుషంగములఁగోడి
శఫరనూతనఘూసముదాయముగ్ధద
వ్యనన వాపాంగకచ్ఛవులఁగోడి
హృతమత్స్యశిశు శిశుక్రీడార్థమత్స్యమా
త్రిథవ్యర్థనావైభవాప్తిఁగోడి
శఫరీపరిస్ఫూర్తి వేశ్మద్వారదుర్దృష్టి
సాత్రిహేతుఘటనదివ్యతలఁగోడి

పృషదధఃస్థితిక్షోభకుఁ గృపీటనివస
నార్థమేదమంభఃప్రవాహమ్ము నావి
వస్వహృదయ మాచంద్రిమఃపరిభము మత్రిపి
యాంగనాశరీరాస్థి కృష్ణార్పణమ్ము

నశ్శోకషత్పాలవార్నటచ్ఛిత్రకం
గాహతంబులకు నుయ్యాల లూఁగి
కుంభజన్మోదయారంభశుక్లచ్ఛవి
భవదంబుమృదుశయ్యపైన నూఁగి
మాఘమాసికకోష్ణమార్తాండరుచిధగ
చ్ఛబలితాంబువుల విశ్రాంతిఁ బొంది
శుచ్యుష్ణతాదహచ్ఛుద్ధవార్వేణికాం
తర్లీనపక్షిక్షితములఁ బొలసి

నాల్గుకాలాలపా టనంతపవిత్రపూత
జలనివాసంబుకౌలకు నాసార మాన
సత్తు నామధు వాగ్విస్మ ముత్తమాస్మ
దంగనాశరీరాస్థి కృష్ణార్పణమ్ము

ఊర్ధ్వతిర్యగధోముహుస్తాడనాంభోవి
ధృతిఘూర్ణతాసికతిలములైన
ప్రత్యుషోమరుదంకురప్రోతటుమ్బదా
నీకసంఘట్టఫేనిలములైన

అనుసృతమోహనగతాన్కరాభిసరణ
వేళ నవనవశృంగార వేష మేచి
కొనఁగ నిది శాశ్వతముగ నుత్కృష్టసతీమ
హాపవిత్రదేహాస్థి కృష్ణార్పణమ్ము

ఈయస్థి పతినత్నిదా యతిమహిమ నం
చంభోఽధిదేవత లాదరింప
అతిలోకసౌందర్యవతియస్థి యిది యంచు
నాగకన్యకలు నున్నవలు సలుపఁ
దమనంటి సొగసు నేత్రములచానది యంచు
మత్స్యకుమారికల్ మమతఁ బెంచ
ఆప్రోక్షసుకవిఘుల్లోలి దగమను జలాం
తర్లీననాదసంతతులు పొగడ

ఈమహానారిసంస్థాన మొనయుకొలను
నామహాప్రేమబలమున నామహర్ష.
మతము నాసర్వదేవతావితతభావ
మస్మదీయపవిత్రాస్థి కృష్ణార్పణమ్ము

సుతహావిర్ధృతమహాసుతతితూష్ణీంసురా
హాగమసద్బుధరూపమైన జ్యోతి
ప్రాగ్భూతము భూతవత్పరిణామయుత
స్వీకరించిన యార్ద్రత్రైకరసము
సర్వభూతపునారసత్వసంకోచవే
ళావికారోజ్జ్వలదమృతమూర్తి
అఖిలావకాశపూర్ణానుసంగతసంవి
దాకారపరరూపమైన బ్రహ్మ

మీనుహాసస్వరూపము నామహాజ
లావికారరూపము నాప్రియము వినుమ
మునికిదై యస్మదీయనాశో త్తమాంగ
నామృతతనూగతాస్థి కృష్ణాగ్నిముష్ట

ఏతన్నదీకాల్య తెగసి పాడించెదు
రాజనంబులకు శ్రీరామగత
ఏతత్ప్రయఃప్రశస్తైకమానాంధ్రప్రా
ణీదూషితామయాంభికి శివాజ్ఞ

ఏతన్నగ్రోధస్థసీనాశిష్ప వశోత్పతి
కశ్రేణి నీరాత్మ్రరత్నాకనవనము
ఏతవంతర్వ్యసత్ప్రితజాతుతతి క
న్యోన్యహింతంకరణౌషధమ్ము

గాంగ విపారి నాత్రిలింగవిషయమ్ము
నాసకలవారిజంతువు నమరియుండ
నస్మదంతర్జ్వలద్దీప మస్మదంగ
నాసుధాశరీరాస్థి కృష్ణార్పణమ్ము

వితతోగ్రవార్జంతువిన్మృతాస్యదశనసం
గ్రసనప్రమాదసంఘములవలఁ
బ్రాక్తీరబహుళతీవ్రప్రభంజనధుతాం
భఃప్లావనోపప్లవములవలఁ
బర్యగాధాంబుశోషణచమూహగణాగ్ధ
పరికీర్ణ వాగురాపదలవలన
శుక్తికాద్యపజిహీర్షుజననానాసహ
కర్షణాదికదైవికములవలన

ఫాల్గు. వోకయు సంద్మ్యృతి పౌరయకయును
దతమహానారి నిత్యసంస్థాన మందు
కాలను నాతాగకముగ నుతుకలసుధేశు
ణామృసుతనూగణాస్థి కృష్ణార్పణమ్ము

వాగ్జంతునిధుతజగ బాలాంతనుద్ధత
బుద్బుదశ్రేణి యూర్పులుగఁ దనరి
అన్యోఽన్యసంఘృష్టశాతి వేంతగంగ
ఘోషఁ జేతులు మోదుకొనుట నొప్పి
అస్త్రవేళాప్రజితానిలాహతతట
చ్ఛిన్నడిండీరమ్ము చెమట నలరి
ఉపరికూజద్విహగ్రయోగవ్యథాప్లుష్ట
చక్రవాకిమొలుంగుసమితి కూర్చి

నాకుఁ దోడుగ దుఃఖమంథరవిషాద
మూర్తి యీనది శాశ్వతమ్ముగనె గాఁగ
అస్మదీయగోత్రవిభూషమైన మత్ప్రి
యాంగనాశరీరాస్థి కృష్ణార్పణమ్ము

ఒక రెన్నొ పుట్టుకలకు ముందరైన మ
ప్రాగబ్ధ మీరీతిఁ బరిణమించె
నానావిచిత్రజన్మకృతాస్మదఘరాశి
అయి అయి నేఁటి కి ట్లయ్యెఁ దుదకు
పితృగ తనుగు నా స్త్రీ హంత మయ్యె నాయంను
ఆయ నిచ్చినభాగ్య యల్లె పోయె
నా తండ్రిచేసిన నానామహాపుణ్య
కర్మ లీగతి గంగఁ గలసిపోయె

మిగిలినది యొక్కఁడే నాకు మేరువంత
బరువు నాగుండె లో మధ్యభాగమందు
అంతె పేరున కంతె భార్యాస్థిగాని
నాశరీరాస్థి నిజము కృష్ణార్పణమ్ము

# అస్థిప్రసాదనము

[కర్మశతకము: ౧౦వ పది]

దీవ్యద్దివ్యసహస్రభానుకిరణోద్దీప్తాత్మమూర్తిప్రథా!
భావ్యాశాత్రుటనక్రియాపరిణతపౌరుషప్రభావాంచితా!
నావ్యానంతమహాపయంబుధిపురోన్యస్తోగ్రకోణావలా!
పవ్యాఘాతనిశాతబాణహరిణత్రోప్రథా! నమ స్తే నమః!

భూవ్యోమాఖిలపంచభూతము చితామధ్యస్థసింహాసనా
గ్నివ్యుత్పన్నభవన్మహోజ్జ్వఁ బడియె కాంబోలు స్తంభీభవ
ద్భావ్యాత్మీయమహాణుసంచయముతోఁ దామైశ్మశానంబునం
దవ్యష్టాసువుగాఁ బొనర్చికొనె దివ్యాస్థీ! నమ స్తే నమః!!

అవ్యాజోలమనఃపరిభావము శివాపారేశ్వగత్వంబు స
ర్వవ్యాపిత్వము మంత్రివర్గతతి రుద్రాక్షాభిధానంబు వ్య
స్తావ్యక్తుం డగు సామి తద్భుజగజిహ్వాగ్నిచ్ఛటల్ తోడి గ్రి
వాహ్యాలంబవిభూష వే మనెద నిన్నస్థీ! నమ స్తే నమః

దివ్యాక్షీ! భవదీయమౌ పలితమౌ దేదీప్యమానంబునౌ
భవ్యాకారము హేయమయ్యెఁ దలఁపన్ బ్రహ్మాండరాహస్యవి
ద్యావ్యాపారము గోచరించుఁగద నీయందున్ విచిత్రింపు మా
నవ్యాఖ్యానము చేయుచుం దూపవిస న్నానామహార్థాళికిన్

సవ్యామోహామయైన యీజగము దీర్ఘానంత్యసంక్లిష్టి తా
మవ్యాపారమునన్ దగుల్గొని యసంపద్వ్యాజనంబై చెడన్
క్రవ్యాదాభదురామయప్రతతిజగ్ధంబై మహామృత్యుజి
హ్వావ్యోమావృతిలుప్తమయ్యెనకొ! నీవ్యాఖ్యానముల్ నెచ్చెలీ!

నవ్యప్రోషమహార్థముల్ భవదుపన్యాసంబు లానందరే
ఖావ్యక్తీకరణప్రశస్తములు సంక్లుప్తాఖిలక్షోణిగో
శవ్యాపారనిరాసహేతువులు డోలాసంచలద్దుష్టమా
యావ్యాపాదనలీల లూర్మిళవిషమోగాంభోదఝుంఝుల్ చెలీ!

హావ్యంబై చెడిపోను నీజగము మోహాగ్నిచ్ఛటావల్లిరం
తవ్యంబుం జతిదుఃఖభాగ్విషయసంతానంబులన్ నెంచి మం
తవ్యం బంచును దారపుత్రవివహాత్రక్లిష్టసౌఖ్యంబు హం
తవ్యం బీయఖిలంబు నంచు విమలార్థం బూనె దీవో చెలీ!

అవ్యాజోపకృతీ! సమస్తజగ మేలా హా! సమస్తంబుగా
నీవ్యస్తంబును నూహ సేయు నని నీకే నైజమైనట్టి మా
నవ్యాహారముచే శరీరగతభిన్నద్రవ్య మీరీతి భి
న్నవ్యక్తిత్వము నంచుఁ దెల్పెదవు భిన్నభ్రష్ట మంచుం బోరిన్

తా వ్యాపించె నదే మహాస్థిక! భవద్ధర్మోపదేశంబు నా
యీవ్యగ్రంబగు నాత్మలోన మరి సర్వేహావిధూతిన్ సదా
భవ్యంబైన మదీయసర్వసృజనాభాగణ్యాణుమ్లానము
ధ్వవ్యాకోశవివర్తనభ్రమదనంతధ్యానపూర్ణంబుగాన్

కవ్యాదుల్ భవదీయసారఝరిణీకల్లోలగర్భస్థితిన్
దా నవ్యాపన్నతఁ బొందఁ గా మరపురీస్థప్రార్థసౌఖ్యాలిచే
నవ్యుల్ నీకృపకై సతీవినిహితుండై యేను ప్రార్థించెదన్
దివ్యాంభశ్చలనంబు పొందకావె అస్థీ! మత్ప్రియార్థంబుగాన్

# బెడిసిపోఁక

[స్మృతిశతకము : ౧వ పది]

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
గాలి యుబుక పొగమాఱిన కట్టెవోలె
నడఁచుచున్నాఁడ నిట్లు నాఁగసుగుసందు

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
నాసుధామయమగు జీవనంబునందు
విసము నొలికించుకొన్నాను వెడఁగు నగుచు

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
ఆటకై బెడ్డ విసరి కాలాహి లేపి
తత్ఫలము పొందు బాలువిధంబు గంటి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
నలుగురి కసహ్యతాభాజనంబ నగుచు
సాఁగెద శ్మశానవాటికాష్ఠంబువోలె

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
అపుడు నాగుండెలో గుండెయైయొఁదాని
బొమికలు బుజాన వైచుక పోవుచుంటి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
ఈశ్మశానస్థవాయసగృధ్రశునక
సంతతికి నిట్టుగాఁ గృపాస్థానమైతి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
సగము చచ్చియుఁ జానక సగము కాలి
కాలక విచిత్రజీవిక గడపుచుంటి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
మానుషము దైవమైన సంపత్తు నెంచి
దీని నైష్ఫల్యవిధికి నిందించుచుంటి

అల్పమానుషదోషంబు లాచరించి
అధికదైవికకోపంబు లనుభవించి
మానుసము దైవికమ్మని తేనిదాని
పైకిఁ దగలించుకొందు నా భావవిధులు.

ఈదైవమ్ములుకూడ నానలెన్న లోభేషామదక్రోధనాం
ఛాదుష్టాత్ములు వీరి నమ్మకొని యీయాపద్దుఃఖసౌఖ్యార్థినై
యీదౌర్భాగ్యము లేల త్రవ్వుకొన నిల్లే యుండిన ల్లుండి లో
లో దీర్ఘోరుతపంబుఁ జేసికొని నాలో నేనె నే నయ్యెదన్

బ్రతికినన్నాళ్ళు నాసుఖము పొందినన్నాళ్ళు నొకింత జాలి లే
నిరాదరము జూపుగొన్న పతి నే నొకయప్పుడుగాని జాలి పొం
దితి నను గష్టపుంబఱువు క్రిందని నిమ్మనయోర్పు చేతగా
సతికి సువర్ణమే బ్రతికినట్లుగ నైనది ఓతపస్విని!

ఆతపస్విని తనబ్రదుకంతయు నెదఁ
దాల్చి కొల్చిన దిద్దవైనతముల
బహువయోమూర్తి శిలవోని భర్త నొకనిఁ
బాయరాని కష్టాధిదేవత నొకర్తు

ఓబహుజన్మయోగిని! బహూకృతజాచుపకష్టభాగినీ!
నాబరువెల్ల మోచుకొని నావు స్వకీయవుునట్లు నీవు నా
లో బహిరంతరంబులను దోఁచిని వాక్కుడుఁగాఁగ నిష్ఠురం
బో బలవంత మీబ్రతుకునందలి యప్పరమార్థ మేమిటో?

ఈచరితలెన్న్య మెచ్చుటకి నెచ్చటి కింత లగింపుఁ దెచ్చెనో
సీతపవిత్రశీలలు సతీచరితలల్ల యరుంధతీముఖుల్
సుచరిత లాదిదైనత విశుద్ధచరిత్రలు తన్మహాతపః
శ్రీచరితభాగినీ! పొలుమరించిరి నిత్యపథిన్ సనాతనీ!

కోనల వెల్గులో త్రికోను కోమలచంద్రికచార్ధఖండను
ట్లావ్రితతేజమహాఁ బతిమహావ్రిత మాదలఁ దాల్చి కష్టమా
లావిరుదత్క-పాలవిచలద్గళహారముఁగోడి శైవకాం
తావిలసన్నవాకృతివి తారితి భూతగణా ప్రవృంబలెఁ

అల రజతాద్రికొమ్ముకొసయందలి వెల్గులు నీమనస్సుగో
పల విరళంబులై కొలువవచ్చెను భౌమములైన నాతలం
పులతుదలందు నద్దుకొనిపోయెను నీమన సద్దుకొన్న వే
ళల దయచేసి యీవెలుఁగులన్ బిలిపించుకొనంగఁబోదువే?

మిగిలియున్న యీవెల్గుం చిగురుసొంపు
ఈమహాశోక మెత్తిన యిరులగుంపు
ఒకటికన్న నొక్కఁడు మన సొత్రికొంచుఁ
దాల్చుచున్నవి సమతులాదండరీతి

# త్రైగుణ్యము

(స్వాతిశతకము : 3 వ పది)

ఈజగ మెల్ల కూర్పునొనగూర్చిన సత్త్వరజస్తమోగుణా
నీకవికారకల్పన మనేకము లింద్రియముల్ తదాత్మకా
జాతిగళంబు జీవనము సాగినత్రోవల నెల్లఁ దద్గుణా
నీకవికారకల్పనమె నిండె భృశమ్ముగ ప్రవృత్తిహేతువై

అణువుల నిండి దేహములు యాగు విలీనములైనయట్టి యీ
గుణములు పాళ్ళుగా సమరి కూడి సమంబుగ నున్నవారికిన్
బ్రణయము గల్గు సత్త్వగుణబంధుగసామ్యముకల్మి దంపతీ
గణమునుఁ దద్గుణాధికతఁ గల్గిన చిక్కనిబంధ మేర్పడున్

విగతమహాణుసంభ్రమణనిర్ణయముంబడిఁ బొందియున్న మా
యిరువురియందు సత్త్వగుణ మెక్కువ యౌట రజస్తమోగుణో
ద్ధతులు కల్గియుఁ బ్రణయతోయధిలోఁ జిఱుజంటనావలై
తిరిగితి మల్ల ప్రేమ పథిఁ దీర్చితి మల్లు లతాతరుల్బలెన్

సీ॥ సమమైనను౯ విషమమైనను సత్త్వగుణంబునఁగాఁ బు
ట్టగ వికృతివ్యథావిస్మృతి తక్కిన రెండు మనోభిధాగ్రగాథా
స్పదము రజోగుణంబ యొకపాటిది తామస మొంతయైన సం
పదకలదైన సత్త్వమును భంగము పెట్టు ననేకభంగుల౯

ఆయమలోని సత్త్వగుణ మంబుదమై శిశిరాద్రినూతన
చ్ఛాయలు నాకెకీకమునఁ జాది మదీయగృహోపవనిస్థిర
శ్రీయుతరేఖకు౯ గురియఁజేసిన దట్టపు వానజల్లుల౯
నాయెదలోని సాత్త్వికగుణం బొకబిందువు కైన రాదను౯

ఆయమగుండెలో వినయ మంతట నిండి రజోగుణంబె లే
దాయెను కాని భర్తస్పృహయం బఖిలంబు రజోవిశాలమై
పోయినయట్టి హేతువునుఁ బొంది నిరస్తబుద్ధి యెందొ కా
నీ యపుడప్డు తా నభినయించు రజోగుణ మస్మదగ్రమై

ఆయమలోఁ దమోగుణము నల్ల రజోగుణ మట్టు లల్పమే
ఆయలుపమ్మ నాదయిన యజ్ఞత నామె స్వభావగాఢతా
చ్ఛాయలు పొంది తత్ప్రకృతిసంపదయై చను సత్త్వవైభవ
వ్యాయతి నాయెడంగినదియైనను లేదను భ్రాంతిఁ బూన్పెడి౯

ఆమెకు నేకదేశవిషయంబు తను స్వది కోపరూపమై
యేమెయినైన మాటసహించుక యోర్వనిందోఁచుచుండునా
కో మఱి యాగుణంబు సహజోద్గత వాంపరివర్ధితంబు క్రో
ధాన్విత మౌమె మానుసము నంటి సహస్రశ ఉద్గతింజనున్

ఆ ననుఁగూర్చికాని విషయంబుననైన తనుస్సు పట్టఁగా
రాని మనోధాకృతిం జని పరస్పర మల్లినపేరియసూత్రి మే
షానో యుఁటన్నభీతి కిరవై దినసంగతి సత్త్వవైభవ
శ్రీనిశితాసిక్రృత్తమయి ఛిన్నతఁ బొందె కదర్థమై చనున్

నాయఖిలప్రశస్తకవనంబున కాయమ పట్టభద్రురా
లాయమ లేక యాఘనికమైన మదున్నతవిత్తవృత్తి లే
దాయమ లేక యింద్రియములందలి నాయధికార మింత లే
దాయమ లేని నాదుబ్రదుకంతయు లేనిద యయ్యొ నేఁటికిన్

# విధురత

[స్మృతిశతకము : రవపది]

అట్టిమనోజ్ఞదైవతమవై మనసొగ్గిన యేయఘాధ్వముల్
పట్టి చరించకుండ ననుఁ బాలనఁ జేసితి నేఁడు నీవు లే
నట్టిదినాల నీయెడ దురాచరణం బొనరించునల్లుఁగా
నొట్టిడుకొంచు నే నఘము లొడ్డుచు నుంటిని దేవతాకృతీ!

ప్రభువులు దైవముల్ గలరు భక్తులు నుందురు వారు కర్మకుం
బ్రభువులు కారు, వీరు విధివ్రాతను దాటనులేరు, కాని యా
ఋభువులు సాధనాపథి భరించెద రింతియ కర్మభావి దుః
ఖభరము దేవతల్ జనులు కర్మ కధీనులు పొందనేవలెన్

నిజమున కొక్కమాట తరుణీ! ననువంటి విచిత్రపూరుషుం
డు జనన మొంది కష్టము లనుక్షణమున్ భరియింపఁజేసి యీ
సృజనకు సర్వదాపకురరీకృతి మూలమయ్యైనదానికిన్
ప్రజలు భరింపఁగల్గుదురె బాలలతాసుమకల్పు లందఱున్

పగులదు చీలిపోదు గునపంబులఁ ద్రవ్వినఁ బాము నీడ దే
మిగ ఘటియించిరే విభృతి మేకొను మొండితనంబు నిట్టి నా
దగు తొలిమాయలో నొదిగినట్టిది గుండియ నాయ బెంచుకోఁ
జిగురగు సౌమనస్యమును జెంద ది దెంత విచిత్రసృష్టియో!

కొసకుఁ బ్రహాహ మూఁగి పెనుగుండములై నిలఁబడ్డ కర్మసం
గ్రసనపు టేటియొడ్డువలెఁ గయ్యలు వారిన నా మొడందలో
మొసళులవోలె దుఃఖములు మూఁగుచు గూడులు కట్టుకొన్న న
ల్పసుఖంబు సౌఖ్యముల్ తిరుగులాడిన లోనికి గుంజివేయుచున్

వలపటి దాపటన్ బెనచివై చెడు నాశయు దుఃఖ మన్న మొ
ద్దులజత కట్టి బండివలెఁ ద్రోలుచునుంటిని జీవితంబు ని
వలపటిగిత్త ముందడుగు వైచినచో మునలెద్దు దాపటన్
విలవిలఁ గాడి క్రిందఁ బడవేయును బట్టెడ దూసిపోవఁగన్

నాహృదయంపు రాజ్యమున నాకె విచిత్రము తన్వి మాత్రము
త్సాహము లేదు పట్టిపరిభుక్తికి నేను ఫలంబు గల్గు? నీ
తో హరియించిపోయినవి తొల్లిటిరెండు రిపుల్ విజృంభితో
గ్రాహరణంబు సల్పెద రఁటన్నను జిత్రము లేదుగా! చెలీ!

ప్రతినునుతరంగములు పాములుగట్టిన చల్లనీరముల్
బుసకుప్పలు నేర్పరించి విసరించెను బాలకసాలశాఖనా
నతివ! మదీయమౌ తనువు ఆంగోలినాళుల ముద్దుపారి యే
బుతునవచిహ్నముల్ తల ధరించదు బాడిద యొండుబోదన్నై

ఒకదినమైన నాయెడద నుమ్మలికంబను పుర్వు పుట్టి యీ
సకల మసేవ్యమై చెడియెం జచ్చిన భాగము కత్తినాదగన్
బెకలిచి 'శిష్టసేవ్యతకుం బెట్టెద నన్న ని దేబిరిస్తిమో
అకట! తదీయభాగమె మహాప్రియమైనది నాకు నాత్మకున్

నీ వక్షోరోహమార్గముల నిండిన జానకివై రఘూద్వహుం
గా వెలయించినావు నను గట్టిగ మాప్పదియారువత్సరా
లీ వలభూమిగర్భమున నెప్పుడు వచ్చితినో మఱప్పుడే
నా వెలయింపు లూర్మిపృథునాగభసాక్రమణంబులన్ జెడెన్

# నీడ

## [ స్మృతి శతకము : శివ పది ]

సీ. వాక్పుష్పవెల్గువయి నీవెలుఁగారిన నాదుజీవిత
వ్యాపృతి యీకవిత్వ మనునట్టి విచిత్రపునీడ పారె నో
దేవి! యరుంధతీప్రముఖదివ్యమహఃపరిలీనమూర్తి ఆ
నీవెలుఁగుల్ పరోక్షమయి నేఁటికి నీడలు పారఁజొచ్చెడిన్

ఇది యొకపూలబాటఁ బడి యేగెద నీతొలిమొగ్గ లింత వి
స్ఫదల ఘటించుకొన్న చిఱుపూవులుఁ దావులు చిమ్ముపూలు నీ
తుదఁగలఁ వాడినట్లయి తోఁచిన పూవులు, నెల్లపూవులన్
బదసగు వాడిగుండె కొసవాలిన నావరలక్ష్మి ముద్రయే

అఱునది దాటి నే ముసలి నైనపుడైనను నాయెడందఁగోఁ
బఱువను తప్పనట్టి యెలప్రాయపుఁ గోమలి నీవె నిల్చి వి
గ్రహపరిపాకముం జెడక పాలనఁ జేయఁగ నిట్టులైతి వో
తరుణి! మదీయనూత్నకవితాబహుమార్గములందు నిచ్చలున్

ఎవ్వనను నేఁ బరీక్షఁ గొలయించిన శోకములోని మొల్లయా
పవలును దుఃఖముల్ పదునుపట్టిన పోలిక నన్ను నేన చూ
చిన నటువంటి నాకునయి చెందినభార్యవు నాను మేనికన్
బావలిన క్రొంచెమైన సిరి పుట్టినతోన త్యజించి యేగితే

ఇక్కడి శిలంబు లీగిడన లీతలతిక్కలు పాఁతమాటలుం
చెక్కడ నక్కడే విడచి యేగెదు వారలుగాని భావుకా!
అక్కడ నక్కడన్ వెలుఁగులూరన చోటుల నాకవిత్వమున్
దక్కనునీయదైవతమహాఃప్రియగం బని గుర్తు పట్టితే?

పికటనశోకగుంఫనముదుపజ్ఞవిచిత్రపుఁ గావ్యగంగభూ
మికిఁ జెనవోలె నీవెలుఁగు మొత్తిన యందము ధైర్య మూది నే
న కరుణవిప్రలంభరసనాయకుఁడన్ గవిగూడ నేనె భూ
మిక శోకవంద నొత్తెదసుమీ! అల సూత్రము నీవు పట్టుటన్

బిగదుపడంగ నాహృదయవీణను దంత్రులు బిఱ్ఱుగాఁగ లా
గి గుదుసు లేద నెక్కువ బిగించినచోఁ దెగునో యటంచు బె
ట్టుగ సవరించినన్ దళిమొదున్ జుమి యోసి విచిత్రిగాయని!
తెగి యొకఫెళ్లునన్ జరమతీవ్రవినాదము రేగునట్లుగన్

తొలియమృతంబు నింపుకొనునోసిటు నాసుధ యొల్కిపోయెదో
సిలి తడియారి లేఁతపూఁ జీలిన సన్నవిపేశులైన వ్రే
ళులయెడ నాకుఁ గల్గు స్మృతిశోభము సాంద్రసుధాప్రసాదితో
త్పలమకరందరీతి కవితాసుఖభోగుల కెట్లు పంతునో

ముంపుగ కొండయంచుఁ బడఁబోసెడు నేచుఁగుధార నారిపా
తంపు శిలోపరిస్థలముదారఝరంబున ఘూర్ణితాంబువుల్
కంపితఝంపలున్ కళపెళల్ గల నాకనవంపుఁద్రోవలో
సొంపులఁ జూడఁగాఁ బ్రకృతిశోభనమో కాక మఱేమి యున్నదో

మనసు విఘాతమై మఱియు మాట విఘాతము వీనికైత యం
దని యెవఁడేని నన్నది యథార్థము తేనియసోనజాలుగాఁ
జనదు మదీయధార కొనసాఁగదు నీకరుణన్ కృతార్థతన్
గనినది కాక భావుకజగత్తున కర్థవిచారయోగ్యమై

పొరిదిన్ వే పరిణామ మొందఁగ నశించుం బూర్వరూపంబు ను
త్తరకాలంబున నూత్నరూప మనునౌ తర్కోక్తి నిక్కంబుగాఁ
బరఁగున్ నీసుఖ మే నెఱింగిన పురాపత్నీత్వ భావోజ్జ్వల
త్స్ఫురణం బంతయుఁ జచ్చిపోయినది హాహా! నుత్తమాయష్టికిన్

ఎడఁదయు దేహమున్ మనసు నిత్రయమం దనఁ బూర్వపూర్వమున్
జెడుచునున్న యామెడఁద ఛిన్నతఁగాంచినఁ దక్కురెండునుం
జెడకయుఁ జెడ్డయట్లె, పరిశిష్టము జీవిత మెల్ల నూతకే
రొడలునఁ గీలుత్రిప్పు మనసొప్పఁగ నాదెసనల్లు త్రోఁచెదన్

అమ్మయి నాలుగైన పురుషార్థములందునఁ గామ మొండె దే
హమ్మునయందునన్ సహజమైనది గేస్త్రువాఁడు ధర్మనా
మమ్మున యోగచిత్తుఁడును మధ్యను గామలతావిభేదనో
గ్రమ్మయి జీవితంబు చెడఁగా సహజంబగు చావు పొందుటే.

ఒగి ధగ దారయోగులు మహోన్నతచిత్తులు కొంద ఱుందు రే
సగమగు జీవితమ్మునన్ చాలక యోగము భ్రంశమందినన్
మిగిలిన జీవితమ్మునను మేదిని ధర్మము రక్ష చేయు వృ
త్తిగ మనుచుందు రూర్జితమతిన్ దనునష్టి ప్రతీక్ష చేయుచున్

ఒకయశోనిప్రపాతమున నుర్విజ యొక్కఁడు జ్రీలిపోయి త
క్కక నగమందునం జివురుఁ గాయయుఁ బచ్చదనంబుఁబొల్చు నీ
సకలము మింటియందున నెసంగున బోదయు నెంతకెట్టెయొ
ప్రకటితమైన లోభము పరశ్వధవృత్తులకుం ఘటించుమన్

ఒకపెనుమఱ్ఱి యిట్టులయియుండియుఁ జుట్టుననున్న బాలవృ
క్షకముల శక్తిచే నిల్చి కాష్ఠతఁ బొందకయుండఁ జూచు వా
రికి ధరణీజభావ మురరీకృతముం గలిపించుచుండుఁ బా
ర్శ్వకలితమైన యార్ద్రిత యురస్థ్సముగా భ్రమ పెట్టు చెంతయున్

తెచ్చి సువర్ణమౌ ప్రతికృతిన్ రఘురామకథాకృతూర్జితా
భ్యుచ్ఛ్రయమార్గ మేఁగెదన యుర్విజవాలిక నీవ తొత్తు నా
కచ్చరమైన నాయెడఁదఁ గన్మలితావులు చెల్ల రేఁగునా!
యెచ్చటి కాతపోవనము లేగితివేని హా తేఁడ్రియాకృతీ!

# స్వప్న వాంఛ

[ స్మృతి శతకము : 2వ పది ]

జాగ్రత్స్వప్నము లివ్వి రెండు నిసులాచ్ఛ భ్రాంతిమూలంబు లే
జాగ్రత్కాలపు భ్రాంతి జొక్కుమది యాస్వప్నంబునంజొక్కు
న్వ్యగ్రిస్వాప్నికజాగ్రతంబులను నేలా వేరు చేయంగ ధా
రాగ్రాహంబుగ నెల్ల స్వప్నముల నారా! నిన్ను దర్శింపక

కలితసర్వజాగ్రత్కాలఖండములను
జ్ఞేయ మొక్కడనుస్యూతమై యొసంగు
నట్లె దేహాంతరముల స్వప్నాంతరముల
నేల కారా దనుస్యూతి యేకధార

అదియును జాగ్రదవస్థా
స్పదమగు జ్ఞేయంబుతో నెసంగిన నైక్యా
బుదితానేకంబులు దుః
ఖదములు సందర్భములు సుఖదముల్ చెలంగున్

కడునడి నీవు స్వప్నలతికాసుమమంజరి సాచు నిచ్చెంబున్
గడఁగి యనుగ్రహించిననుగాని మదానతజీవితంబునం
దొడిగెద సూనముం దొడువఁ దూలిన నీదగు తావివెల్లునం
గడిగెదఁగాదె నాయెడఁదఁ గ్రమ్మిన దుఃఖమలంబు భామినీ!

ఈ ధారాభవదీయదర్శనముకై యేలా విచారింపఁగా
సాధారణ్యము కాని కన్పడుట నాస్వప్నంబున న్నీవు దు
స్సాధంబైనది నీవు తోఁచుట, మనస్సంచారిభావంబు లే
గాథల్ కట్టుచు స్వప్నమం దనిన వాక్యంబుల్ వృథాజల్పముల్

మెలఁత! సుషుప్తియొక్క పొలిమేరలయందలియల్పముల్ కుహూ
రేఖలు, సన్నముల్ కలసరింతలు, గాఢసుషుప్తిలగ్నముల్
కల లనిపించుకోఁజగిన కానన మందవు స్వప్నవాచ్యముల్
మలసిన జీవభావగతమన్మనోహరసంవిదంబుధుల్

జీవుల భావనాబలముచేతను సంస్కృతు లెల్ల స్వప్నధా
రావలమాన మంచు నవరాద యట్లైన భవన్నిమగ్నతన్
భావన నాది యొప్ప నొకస్వప్నమునందున రావు నీవు గు
ర్భావులు కల్పనాకుటిలవాక్కు లతీంద్రియద్రష్టృమానులున్

కలఁ గనెడువారికంటెన్
గలయందున వచ్చు జీవి కరము ప్రధానం
బలఘుతరకామవిహతులు
కలలందున వచ్చి తాము కన్పింతు రహో!

ఈ వాక యోగినీప్రకృతి వేటికి వచ్చెదు స్వప్నసీమలం
దీవెడ భావనాపటిమకృష్టవు గావున నీవు రావునన్
జీవులు కొందఱున్ దనువు చెందెద రాత్మకృతాల్పతానసుల్
భావన బంధులందుఁ బెఱవారలఁ గన్మఫలంబు పంచఁగా

తావలనైన కర్మఫలదాతలు తారు విన ర్రమూ ర్తులై
దేవతలైనఁ దాల్చెదరు దివ్యశరీరచయం బుపాసనా
భావన మూ ర్తికట్టెదరు పండినజీవు లరూపభావితుల్
భావనచేతఁ గన్పడరు వ్యాప్రియమాణపథంబు మాయఁగన్

తొలిబుద్ధులైన యుపనిషదుల్ సహజంబు నుపాసనాక్రియా
కలితపథంబులం దొకటిగా గ్రహియించిరి కావ్యమార్గగో
వాంఛలు రసానుభూతి పరమార్థముగా భరతాదులౌ మునీం
ద్రులు హృదయప్రధానతను నూల్కొని చెప్పిరి విజ్ఞతాఖనుల్

ఆనందంబును దుఃఖ విశాయుగళమం దానందసాగమ్ములన్
శేసే తీవ్ర శరీరధారులకు నోలిన్ దుఃఖసాగమ్యసం
స్థానంబుల్ తనువుల్ శుచావధికసంధాచర్వణాంత్యస్థితిన్
దానై యీమెదయే రసాకృతిగ సంధానించు బ్రహ్మాత్మయున్

హృదయము దుఃఖముద్ర వహియించును దాని మనస్సు రేచునీ
హృదయము సౌఖ్యముద్ర వహియించును దానిమనస్సు రేచునీ
మొదను మనస్సు సారథి యహీనుఁడు తారథి భావయోగి తాఁ
గదలుటయే సతంబు పనిగాఁగొను సారథిచేతఁ గృష్టుఁడై

కలఁగి సగానఁ జీఁకటి సగమ్మునఁ దెల్వి మనస్సు వేయుఁగీ
తుల నటు చెప్పు వేయిఫణితుల్ గొని యిట్టులఁ జెప్పు నిట్టు కొం
దలఁబడఁ జేయు వెంబడిన ధైర్యము చెప్పును నిల్వనీను చం
చలమగు నిత్యవృత్తిని నిజంబగు దుఃఖము దానిరూపమై

ఎడఁదను వేయిమార్గముల నియ్యది మోసము చేయు నందుకో
నోపుపుగఁ దాను బాధపడుచుంటి నటంచును జెప్పఁ గాలిలో
నడఁగిన ముల్లు నేయితరమైనను రాచుక బాధపెట్టు నీ
చెడుమన సెప్డు రాచున హృషీకము లంట నెడంద దుఃఖముల్

పండినచేను దేహ మొకపాపపుఁబుర్వుగ దుఃఖ మొప్పినన్
జాడతరావిలంబుగను సాఁగి మనస్సు పొలాన నంతటన్
నిండఁగఁజేయు దీని ననవిన్ మొదలంటఁగఁ ద్రుంచు టెప్పుడో
గుండెయు నిండుకుండ శోణఁకున్ మనసెప్డు కదల్చుచున్నచే

ఈ దుఃఖంబులుగూడ నిష్టములుఁగాదే గుండెకున్ దీప్రహ్మా
చోచ్ఛదముల్ పూర్వపుసౌఖ్యముల్ స్మృతికిఁ దెచ్చున్ మానసం
బుగ్రబా
ధాదీప్రంబగు దుఃఖమందునఁ బురాతత్సౌఖ్యభావంబు సం
పాదించున్ స్మృతిరూపజీవు పటవన్మాయాచ్ఛిదాహేతువై

# మృత్యువిచారము

[ స్మృతిశతకము : నవపది ]

ఎంచి క్రీడోపయోగరాహిత్యకలనఁ
గాయ చచ్చిపోయిన దండ్రు కర్దనముల
అనుభవాయోగ్యతాజుష్టమైన ఫలము
చచ్చిపోయిన దందు రాస్వాదవేళ

అనుభవబుద్ధి దీనిపరమార్థముఁ జూచిన నెల్లవానియం
దనుభవబాహిరంబయినయట్టి యవస్థను జచ్చు టందు ర
య్యనుభవముల్ స్వనిష్ఠమును నై పరనిష్ఠమునై కనంబడున్
మనుజులయందు మృత్యువనుమాటకు నెక్కువయైన యర్థమై

తదితరమంతయుం దలఁపఁ దత్సమయంబునఁ దత్తదింద్రియా
స్పదమగు నేకదేశమున సాగి యొకించుక కూర్చు దుఃఖమి
య్యది సకలేంద్రియార్థపరమార్థమునం గింకురించి సర్వమా
బ్రదుకునయందుఁ గ్రమ్మియవురా! యనుభూతినిఁ జిచ్చువెట్టుఁబో

అనుభవబుద్ధి వచ్చినఁ దనంతట మృత్యువు వచ్చినట్లె య
య్యనుభవబుద్ధి వచ్చినఁ దనంతట మాయయను వచ్చినట్లు వ
చ్చిన దనుమాట లోకమును జెందిన దాయనుభూతి లోకసం
జనితము లోక మియ్యదియు జంట పరిభ్రమణోగ్రశీలమై

అనుభవ మెన్న లోకఘటితార్థమ మైనను జీవులక్షణం
బనుభవబుద్ధి జీవునకు నబ్బెను మాయను బొందియున్కి దా
న, విభృతుఁ డేకమూర్తి తొలినాఁడది హేతువుగాఁగ నీతఁడా
యనుభవ మెల్ల నేకవిషయంబుగఁ జేసి రమింప నెంచెన్

తరుణీమృత్యుజమైన దుఃఖ మిది యుత్థాంభూతమై గాఢను
ర్భరమౌ దుఃఖము నాత్మలక్షణసమగ్రత్వం బౌచు దీపించు ని
ర్భర మీమృత్యు వనిత్యతాప్రకటరూపం బీయనిత్యత్వ మీ
మరణంబై కనిపించుచున్నయది సమ్యగ్దర్శనార్థంబుగా.

ఇదియు స్పృశించునంతవఱ కెద్ది యనిత్యము గోచరించుచు
న్నది పరిశిష్ట మయ్యది సనాతన మన్న యభిజ్ఞ కూర్చుచు
న్నది యొకదుఃఖ మియ్యది ఘనంబుగఁ గూర్పకయున్న దీనివం
టిది మఱియొండు లేదు ప్రకటీకృతచిత్కళ తోఁపఁ జేయఁగన్.

ఒకండే వస్తువు దానినేమి యొకండై యొప్పారునే వ్యావహా
రికముగ లేమిని స్వీకరింపక సమర్థింపగ రాదామె భ
ద్రకదంబాకృతి, మాయ యన్నదిది మిథ్యావస్తుసాహాయ్యరం
జకమై యొప్పుట నిత్యవస్తువు దిదృక్షాశీలురౌ వారికిన్

అసలు చూచెడువారికి నాశ లేదు
నాకుకొను మార్గ మక్కఱలేదు మాకు
మందబుద్ధులకోసమై మరణ ముండె
దానియనుభూతియును సమృద్ధముగ నుండె

ఈదుఃఖమ్మును మరణము
పాపులు త్రవ్వుకొనియున్న పరిభవులనాడుల్
ఛేదించుటకన్నను నను
మోదించుటయందె ప్రియము పుట్టెను మాకున్

# స్మృతి కాని స్మృతి

[స్మృతిశతకము : ౧౦వ పది]

మరల వివాహమాడియును మానిని! నీవు గతించి పెక్కు పు
ష్కరములుదాఁటి భార్యయనుశబ్దమునామొకలాఁ బ్రయుక్తమై
స్ఫురణాస్వభావరీతి నినుఁ బొందును దోడ మఱెబ్బుకొంచు నా
ద్విరచితపూర్వకర్మఫలవిధు లసాధు లఁటంచు నెంచుచున్

ఒగిఁ గనుమూసియున్ దెరచియున్ భవదాకృతి యచ్చుగ్రుద్దిన
ట్లుగఁ గనిపించు నిచ్చలును లోచనవీథిక నేమనవ్వు నీ
దగు గమనంబు సర్వమును నప్పటి కిప్పటి కొక్కరీతిగా
నెగడెను విస్మృతింగనని నీస్మృతి యేమిటికో లిఖించెదన్

పొరి నిరి వేయికల్పనల బుంగ జగత్తును విశ్వసింప న
బ్బురమగు నమ్మకంబులకుఁ బుట్టు, గతించిన జీవి యేదో త
ద్విరహముఁ బొందు జీవి మఱి కాఁడొ! పరస్పరసాహ్య మెల్ల ని
ద్ధర నొకఁడే రచించుఁ బయిదారుల వారును వీర లెవ్వరో!

అనుభవపారమార్థ్యమునకైనవి మేనులు నిక్క మెన్నఁ ద
త్తనువుల కించుకేనియుఁ బ్రధానతఁ గల్గను తాదృగూహచేఁ
దనువులయం దభిజ్ఞ యరుదారఁగఁ గల్గును వీడిపోవు న
య్యనుభవరూపజీవునెడ నట్టియభిజ్ఞ ఘటిల్లు నేగతిన్

నీవొంటుంబడి నేనుఁ జత్తుననఁ దన్వీ! యింతయాకాశ నుం
దీ వే మైనాం చచ్చిపోవుపయి నే నే మౌదునో సంసృతి
వ్యావృత్తిన్ మనరెండుజీవులకు నైక్యం బెన్నినా ళ్ళన్ని నా
ళ్ళాలిషాకనము కల్గఁ బైని తలఁపుల్ వ్యామోహసంజాతముల్

ఆయమ నాకు భార్య యన నాతనువందలి యాస ముఖ్యమే
దో యొకజీవుఁ డాతనువు నూచినఁ జాలునుగాని జీవుఁ డేఁ
డో యెఱుఁగంగరా దెఱిఁగియున్ మమకారము లేద దాని పై
మోయఁగ ముఖ్యమైనది యముఖ్యమ ముఖ్యముముఖ్యమై చనన్

ఆసీదేహమునందు జీవుఁడయి యేయత్నుండొ రక్షిస్సా నే
ల్లొప్పి నిక్కంబుగ నెవ్వఁడైనది నెలో నాకు సామాన్యగో
కానీతంబగు సంసృతిప్రభవసౌఖ్యజ్ఞానమే చాలుఁగా
ఆసీదేహము రూప మియ్యదియె ముఖ్యంబుల్ సచేష్టాకముల్

నాయీఃదుఖ మి దేమి! నే బ్రతికియుండన్ నీవు చాకుండఁగా
నీయాదేహమునందు జీవుఁ డెవఁడేనీ మత్ప్రమాణాయువై
కాయంబున్ వహియించియుండ డనియేకా యెవ్వఁడో నాకునై
కాయం బేటికిఁ దాల్చు స్వల్పముగనై కర్మైక్యసంధానముల్

వాఁ డెవ్వఁడో వహించిన
పోఁడిమియే లేదు నేనె పూనితి నిన్నున్
వేఁడియగు కర్మబలమున
వేఁడిమి తగినంత లేక వెస మత్కర్మన్

పది వేల్న మ్మ్లకముల్ ఘటించి కొనియీ వ్యాఖ్యానముల్ చేసికొం
చెదకున్ శాంతి ఘటింప నెంచెదనుగానీ! యింత వ్యాఖ్యానసం
పద నాసొంతము కానిదాట నిది శంపాదేహా! వాగిందిరా
స్పదమై నాయెద నొవ్వరుంతుదముగా స్పష్టంబుగా సాగెఁడున్

# దుఃఖనిత్యత

[ నిత్యశతకము : ౧ నపది ]

కరుణాస్వాంతము లెంతమందికిని శోకంబంచు భార్యల్ గతిం
పను దుఃఖింపరు నేను దీని నొకకావ్యంబున్ వినిర్మించి న
త్తరుణీదుఃఖభరంబు దీని నొకపెద్దం జేసి వా రెవ్వరె
వ్వరో యిట్టీతిని చేసినా రనెడుభావం బూని యగ్గించెదన్

మరియును జూడు మేను త్రపమాలి వియోగకృతిన్ రచించెదన్
మరియు వివాహ మాడితిని మానిన దింతయు లేదు జీవితం
బురుతరదుఃఖశీలి యజుఁడో మఱి రెండవపక్ష మూని దా
శరథిగాను కామినీవిరహశీలుల నవ్వులపాటు మాందృశుల్

వారివియోగకావ్యములు వ్రాసిరి పూర్వమహాకవుల్ మఱిన్
నేరిచినట్టినాఁడఁ గృతి నేను రచించెద నాకు నేనక
ట్టా! గనహీనుఁడన్ దెలియనయ్యెద నియ్యెడఁ గోవి వట్టితోం
దగ దరహాసభాసురమనాగ్వినయాదరభావుకావలిన్

అక్కట! నేరు చావ ననుఁబట్టెడి యున్నదె చావ నెప్పుడో
యెక్కడనో యటన్న మతిహీనత దుఃఖము పుట్టునప్పుడే
అక్కడనే యటంచు చెలఁగినప్పుడు దుఃఖము పుట్టదేమొ కా
దక్కట! యెద్దుచుం జనువునందిన దుఃఖము సాజమై చనున్

నెలలు గడచినఁ దరువాత నేర్చుకొన్న
యదియు నవ్వేడ్పు జన్మతో నైన గుణము
నవ్వె దేమిటి కనుట ప్రశ్నంబు కాదు
పరగ నేనేడ్తు నన్నది ప్రశ్న కాదు

ఇంకుట యొన్నఁడుం గలుగ దెండను తీయను నిత్యదుఃఖకూ
లంకష పారుచున్నది బలంబుగ బిట్టు తుపాను రేఁగి దుః
ఖాంకముగాఁగ దక్కినదియంతయు లోకము మూఢవృత్తి సౌ
ఖ్యాంకముగాఁగ నాశుకొన నయ్యది కాని దదన్న మచ్చికన్

దోస మెఱుంగుఁ బండితుఁడు దుఃఖ మెఱుంగు వివేకి దుఃఖమ
భ్యాసము చేయఁగాఁ దగినయట్టి యొకానొక విద్య సద్యుఁడు
ద్భాసితచిత్తవృత్తికిని బ్రాధనికాంశము వేఁడు దుఃఖసం
త్రాసియె వాఁడు సాధనపథవ్రతరిక్తుఁడు జ్ఞానవీథిఁగా

కద్ది దుఃఖపుఁ జేటని నొప్పిఁగ లేన
గొనక్క వేయుఱసానులు కొగ్గి కాని
యలలయలజడి మునిఁగెనే యలసి కొనఁగ
నది నదో కారణం బని వెక్కికొనుచు

విసము ద్రింగిన వేలుపు వెక్కసంపు
దుఃఖమును మ్రింగఁడాయె నా దుఃఖ మెంత
మనసునకు నిష్టమైనట్టిదినుసా కాని
దీనితత్వమ్ము తెలిసియుఁ దెలియరాదు

అశరీరమ్ము ననాది నాంతము త్రికాలాబాధ్యమున్ మారుపే
ర్నిశకున్ మాయకు సృష్టికిన్ శమువియన్నిర్మోకమూహా! క్రియా
దశ లేనప్పుడుకూడ దుఃఖ మిది నిత్యంబై యఖండాకృతిన్
విశదంబై పొలుపారు గూఢతమసంవిద్ధ్యైనాథ్వంబుగన్

# కర్మనిత్యత

(నిత్యశతకము : 2 వ పది)

అల్పుల్ చెప్పెద రల్పకారణములన్ వ్యాపన్నచిత్తుల్ వృథా
జల్పుల్ తర్కసహాంబు గాక పరినిష్ఠాసంప్రవద్వాహినీ
కల్పంబై ప్రవహించుచున్నయది యాకర్మంబు తద్వాహిని
శిల్పుల్ నీవును నేను యత్కృతము భాసించున్ దదానిష్టమై

ప్రళయంబందున సర్వకర్మలు నశింపంగాఁ బునస్సృష్టి సం
దర్శనానేహమునందుఁ గర్మ మొద లెన్నన్ రాదు నాన్ గర్మకం
దళముల్ గాక నుపేక్షయా సృజన కాద్యంబౌ నిమిత్తంబు త
త్ప్రళయంబన్న విలీనతాగుణము నిద్రావస్థ తత్పూర్వమున్

సూత్రప్రాయముగా వచింపఁబడియెన్ సూ! అద్ది సంకల్పమం
చత్రత్యంబు రహస్య మియ్యదియ కర్మానంత్యసాంతత్వముల్
సూత్రప్రగ్రథితంబులైన మణులై సొంపారుఁ గల్పాంతు లు
గ్రతేజఃపరిదీప్తముల్ మొదల జాగ్రత్కర్మసంసూత్రితముల్

స్వస్థానచ్యుతికిం బ్రియుంపక నిమిషన్ జన్మ సంవిత్క్రియా
నస్థాఘాతము కర్మ కర్మసగుణా బరిహార్ష్ణ లీహేతువై
పరిస్థానోజ్జ్వలమార్గదీపములుగా భావించుచున్నారు క
గ్నస్థాస్నుత్త్వముకల్పకల్పములుగా బ్రయ్యర్థ్వముల్ బ్రోగఁగన్

ముకురాకారము కర్మ నీడ యొలయింపుల్గోటు సంకల్పపూ
ర్వకకర్మాగ్రభమాణమై దనిన సర్వంబున్ బునఃకామనా
ధికసంజాతవినూత్నకర్మజనితాధివ్యాధిదుఃఖంబు పెం
చుక యీలోకము లద్ది సౌఖ్యమనుకొంచున్ నిత్యమై పొల్చెడున్

చింతితమైన పాపములు చేయుచునుందుము తత్ఫలంబు సం
క్రాంతముగాఁగఁ బోయి నరకంబున నుందుమ యిట్లు నేమి ను
బ్రాంతిఁ జరించుచుండెదము పార మెఱుంగఁ డటన్న నల్ల కా
లాంతమునందుఁ దాను బ్రళయంబది కర్మసుషుప్తిరూపమై.

కామన లేక కర్మకును గర్తగవెట్టి విముక్తుఁడై 'బహు
స్యా' మితిభావనావిషయునై మఱియుం జను వెత్తి వేమఱిన్
గానునఁ గోసి నిత్యపరికల్పితకర్మత నైన దేమి లే
దే మఱిఁ గాని దంపయిన నేమియు లేద నిరంతవైఖరిన్

మానసాదూరూఢుఁడనై పోరిం బనిమహాంసంబోధ నిష్కామక
ర్మము సేయుఁ గలె దానికంటె మమతారంభుండనై చేయు క
ర్మము మేల్ సౌఖ్యమొ దుఃఖమో ఫలపరిగ్రహా త్తసౌఖ్యంబుత
థ్యము సంకల్పము సేయ నేటికిఁ దదా త్త క్లేశభోగంబునై

చేకొని ముక్తులై చనిన జీవులదైన ప్రమాణ మాతి స
శీకృత భాగమందు కొఱ చెందద యియ్యది కర్మనిత్యతా
ఖ్యకృతిఁ దాల్చినట్టి విషయంబగుఁ జిట్టిమనిష్క్రియ తగ్గమం
గాక యదేల యూరకయు గర్తృమునంగూడ వేయుటల్

సకలశ్రోత్రుఁడవ్యయనే శివుఁడు నేసౌఖ్యంబు లేనివాఁగన్
సుతశ్రోత్రుఁడవ్యయనే ముని వశిష్ఠుం డూగకే బ్రహ్మమై
తతసంకల్పము చేయు బ్రహ్మము సముద్యత్కర్మపుంజంబు వి
కృతిలేనట్టిది కర్మ కుల్యకరణిన్ సాఁగున్ త్రికాలంబునన్

# నిత్యతానిర్ణయము

(నిత్యశతకము : 3 వ పది)

కృప నెత దుఃఖకర్మలను నెంతగఁ జెప్పిన నిత్యతావిచా
రపథమునందు నంధబధిరంబగు దోషివహుఁ బోనఁగాక నే
రుపునొగుఁ జూడఁగా నివి యనంతుదముల్ గుణమై యవస్థమై
యెపుడు పరాశ్రయంబులు మరెద్ది నియామకమూహ సేయకన్

శాంతి యొక్కటి పరమలక్ష్యంబు గాఁగ
నీగుణావస్థ లివి శాంతిహీనము గు
శాంతి పరమందె కలద తచ్ఛాంతిపార
మొక్కఁడే దిక్కు సంసృతిఁ జిక్కువతికి

ఓతపోరితము నన్మనీకృతవిచారోదారరత్నాకరుల్
తారితన్ భావపథిన్ విచారపరముల్ త్రియ్యాంతరూపుల్ ఋషుల్
చేతస్సర్వపథానుశాసకులు తత్సిద్ధాంతవాక్యగ్రహణా
సీతంబై చను శాంతి వేఱుగతి లేనేలేద సంసారికిన్

శాంతిపారముగూడ నిస్సంశయముగ
సద్విగొనక యూహ సేయుట యది విచార
పరమ్మైనట్టి స్థితి యూహ పరమకోటి
పాటితంబైన కర్మనిబంధములకు

తనకుఁ దాన సర్వోహసంధాత నెవఁడు
తనకుఁ దా సర్వవిద్యావిధాత యెవఁడు
పూర్వఋషిభావనాసస్యములను గోయ
నా ఋషులె నైన యూహాసంతతులు గాక

అవి సూత్రీకృతమైన యగ్రథనము గూహాశ్రేణి వ్యాఖ్యానత
స్సవిశేషప్రతిపత్తికంబుగ గదింపబడ్డ భాష్యార్థగల
గ్గవిశేషాదరబుద్ధియై జగము భిన్నం బయ్యెఁ దాత్పర్యసిం
ధువులఁ గర్మవిభిన్నతఁ బహుగతిఁ నూహార్ణవ సంసారమై

తనమతమే యథార్థమని తా నెవఁ డెంచుఁడు నిక్క మెన్నఁగాఁ
దనమత మేమి యున్నయది తద్గతకాలమహర్షి లోకభా
వనముల నొక్కఁ డేర్చి తనపట్టిన త్రోవయ కాక నిత్యమై
చనినది వేద మొక్కటియె శాస్త్రములన్నియుఁ గల్పితంబులై

తనయల్పజీవితంబం
మున నశ్వర మగుచు నెల్లఁ దోఁచిన సర్వం
బును కాలఁతబద్ధ చాలక
వినశ్వర మాఁటంచు నెంచు వీడఁడి యెవఁడో

విదితమనోజభావముగ వేదపుఁజెట్టుచివళ్లు గాలికిం
గదలని రాగరంజకతఁ గాంచని చిత్రవసంతరూపమై
మృదుమధువీథులం గనఁ జరించుచు నామెయెడ లే నెఱుంగ నీ
పదమున సర్వదుఃఖములు బాసెడు మార్గము గోచరించుచున్

నీనాయందలి సమ్యక్
జ్ఞానసమాహారమైన సంవిత్పదమై
యానందనికేతనమై
యానిత్యాకార మొక్కఁడై చెలువొందున్

# కఠము

[ నిత్య శతకము : రసపది ]

ఓహో! మృత్యువు మృత్యువు
దేహంబున నంటియుండె ధీనిధి వైనన్
దేహమున నంటియుండకు
వాహా! మిత్రికిని గండ యందిచ్చినటుల్

మునుపగు విత్తమోహమున మూర్ఖుఁడు తీరనికోరికం బ్రమా
దాపడి సాంపరాయమతి తా నెఱుఁగండు కడిందికోర్కి సా
లింపుల లోకమే తలఁచు లేదని చెప్పఁ బరంబు వాఁడహో
కొంపకుఁ దెచ్చు మృత్యువునకుం గడు దగ్గరిచుట్ట మన్నఁగన్

ఎవఁ డవిజ్ఞాత యమనస్కుఁ డెవ్వఁ డశుచి
యెవ్వఁడో యయుక్తమానసుఁ డెవనికింద్రి
యములను బొగరుఁబోతుగుర్రములు లాగ
నల్లుచును వాఁడు మృత్యువునాప్తమూర్తి

నెలపలివైన కోరికల వెంబడిఁ బర్వులు వెట్టి మృత్యువు న
న్నాల వలపన్ను పాశముల బాలుఁడు చిక్కఁగొనున్ మహాబలీ
వల నది వేఱు వేఱి దనుభావము కలిగినవాఁడు నిత్యయా
త్రలు పొనరించుఁ బొందు నిరతంబుగ మృత్యువు నుండి మృత్యువున్

-అల హృదయంబునందు ముదులాది మొలంగును నూఱు గొక్క నా
డులు మునువానియందుఁ గడుంగడు నొక్కటి మూర్ధవినిస్సృతం
బలయిక దానిఁ బట్టుకొన కన్యల నుండినయట్టి నూఱు నా
డులఁ బడి పోవువాఁడు మృతిఁ డొంకఁబడిం జనుఁ దా నెఱుంగకన్

కృషి పొనరించుచుండుము నరింపుము తత్ఫలమంతయున్ శతా
యుషులగు బుత్త్రపౌత్త్రులను బొందు మహాత్మా! పశుహస్తి
హేమముల్
తృషితుఁడ వౌచుఁ గోరుము ధరిత్రినిఁ బాలనఁ జేయుమంచుఁ గి
ల్చినమతి నాశపెట్టు నవలీలగ మృత్యువు సర్వకాలమున్

ఏకామము దుర్లభమో
ఆకామము కోరుచుండు మని లభియించున్
నీకంటె మ ఱెవ్వండని
చేకొమ్మని మృత్యు నాశ చెందించుఁజుమీ.

తోయ్యాలు లెల్ల నీ కితరదుర్లభలున్ లభియింత్రుచు మ్వే నీ
వియ్యాసిలాధ్వ మెల్ల వహియింపుము చిత్రగాథాధిరూఢుండై
యెమ్మోడఁ దూర్యనాదముల నెల్లయుఁ గాలము నేలుకో సుస్మితం
చోయ్యన లాగుచున్న యది యాఁక మృత్యువు యోగినైనన్

చల్లనివిల్లి తెమ్మెరలు చందురు వెన్నెల సన్నజాజులున్
మొల్లలు మత్తైన గంధమెయిపూత లుశీనగదాపుకంబులున్
మెల్లని ప్రేమసూనుతలును మెత్తని సెజ్జలు కన్నుఁగొంజలల్
వెల్లని పూర్ణశేఖరుల వేఁగు నివన్నియు మృత్యురూపముల్

ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రా
ప్యోత్తమసుఖులైన గురుల నొందుము, జ్ఞానం
బెత్తిక్కొనియున్న పదనగు
కత్తిసుమీ దాని దాఁటఁగా శక్యమ్మే!

దగ్గగనుఁ ద్రోసె నొకతృణ
మగ్గియు ముట్టుకొని దాని నది తాఁగాకన్
సిగ్గతి పుగపుగ నుంచును
నగ్గి తొలఁగిపోవె నాకమై యది వెలుఁగన్

మకుటమువంటినాఁడు సుగమండలియందునమైన గాలి త
న్నికటతలంబు చేరి యని నీ వెవరీ వెవ రన్న నేను! చె
ప్పక తెలియుఁ గురుత్తు నన వారక యేమి పొనర్తు నం చనన్
వికలముగాఁగనై విసరివేసెద సర్వము నంచుఁ జెప్పినన్

దగ్గగనుఁ ద్రోసె నొక తృణ
మొగ్గను వాయువును నూఁగియాడి ఫలము తే
కొగ్గయి సిగ్గయి తొలఁగిన
దగ్గలముగ నద్ది నాఁకె వహించుచు వెలుఁగన్

మకుటధారియైన మనుజుఁడు చనుదెంచి
యెవర వంచు నడుగ నేంచుకొన
నామనోపదార్థ ముగుపించకుండఁగఁ
బోయె నచటఁ దోఁచె ఫుల్లమూర్తి

విలసన్మోహనమూర్తి కన్పడియె నుర్వీభృత్తనూజాత ని
శ్చలసౌదామినివోలె భావసముదంచచ్ఛోభమానాంగి వే
ల్పులఁజేఁ డంజలిఁ బూని మ్రొక్కి దివిషల్లోకేశ్వరీ! యింతసే
పుఁ గన్పించని దేని చెప్పఁగదవే ప్రాణేశ్వరీ! నావుఁడున్

అదియే యానందాకృతి,
యదియే చిత్కళయు, సత్తు, నదియే బ్రహ్మ,
మ్మది సర్వశక్తిమూల
మ్మదియే, దానిని నెఱుంగ గల్పజ్ఞమతుల్

అల్ల చని సంచరించిన యగ్నివాయు
లాతఁ జనియునుఁ గానివయిట్టి యింద్రు
డధికుఁడై తన నింక బ్రహ్మమ్ము నెఱుఁగు
చెట్టిదో దానియునికి యదెట్టి దగునో!

# ప్రశ్నము

[ నిర్వాశతకము : ఉపపది ]

తనగంగఁ బిప్పలాదుని విదగ్ధుఁడై చను భార్గవుండు ని
ట్లని యడిగెన్ మహాత్మ! ప్రజ నంతయు దేవత లెంతమంది క
న్గొని ధరియింతు, రెవ్వరు ప్రకాశము తెచ్చెద, గట్టివారియం
దును వరిష్ఠుఁ డెవ్వఁడు మనోవిభవాయతనా! వచింపవే!

తనగంగఁ బిప్పలాదుఁడు విదగ్ధుఁడై చను భార్గవున్ వచిం
చెను గగనంబు వాయువు విశిష్టుఁడు వహ్నియు నీరు ధాత్రి వా
జ్మనసులు శ్రోత్రనేత్రయుగంబును బ్రాణము మేను తాల్తు మం
చును వెలిగింతు మంచునను మద్ధృతిఁ జెప్పుచుండ నెంతయున్

వాగలకున్ వరిష్ఠుఁడగు ప్రాణము చెప్పెను మోహమూఢు ల్వ్యా
హారము లాడబోకుఁ డొకఁడైనవు భాగము లేచు నేన వ్యా
పారము చేయుచుండఁ జూచి ప్రాణము నందు ధరింతు నన్న వా
రేరును శ్రద్ధధానత వహింపమి చే నభిమాన మూనుచున్

బాణమునుండి లేచినని ప్రాణము వాయును లేచిపోవఁగా
బాణమునందు నిల్చినది ప్రాణము వాయును నిల్వ భూమిభృ
ద్రోణము తుట్టెయందున మధువ్రతముల్ వలె లేవ లేచి ని
ర్వాణము నందిన ట్లతఁడు వచ్చిన నింద్రియముల్ స్తుతింపఁగా

అతఁడే యగ్నిగఁ గార్తి సహస్రాకృతి సూర్యుఁడతండె యంబుదా
యాతుఁడతండె యింద్రుఁడును నాతఁడె వాయువునై సయాతఁడే
యాతఁడె పృథ్వి చంద్రుఁడును నాతఁడె యాతఁడె సదసత్తరం
బాతఁడె నిత్యమౌ నమృత మాతని మించిన దైవ మున్నదే

ఆకులు బండిచక్రమున నడ్డఁ బ్రతిష్ఠితమైనయట్లు ఋ
స్తోకము లోను ఋక్కులు యజుస్సులు సామములు నాల్గువర్ణముల్
తేఁకువఁ బ్రాణమందునఁ బ్రతిష్ఠితముల్ ఋభురాజునందు న
ప్రాకృతమై నతంబయిన ప్రాణమ సర్వనిష్ఠమూర్తివై

నీవు సమస్తగర్భముల నిల్తు ప్రజాపతివై మహాబలుఁడా
జీవులు నింద్రియంబులును జేర్తువు నీకు నహింతు వెల్లనగ
దేవతల సమస్తపితృదేవతలం బ్రథమస్వధాకృతీ!
యీవ యథర్వుఁ డాంగిరసుఁ డీఋషు లెల్లగ జ్ఞానరూపమై

ఇంద్రుండవు చంద్రుండవు
సాంద్రములగు తేజములకు స్థానంబవు నీ
వింద్రియముల కధిపతివి య
తీంద్రియజ్యోతిస్సులకును ధరణివి నిధివై

ఏతరుణి నీది వాక్కున
చేతంబునఁ గనులఁ జెవులఁ జెంబు వాగువో యేమో
నీతరుణి శివకరంబగు
గాంత వడలిపోకు మమ్మ! ప్రాణమా! నీవున్

ముల్లోకంబుల నృత్తము
తల్లీ! నీయెడఁ బ్రతిష్ఠితంబయి పోలుచున్
బిల్లలయెడఁ గృపఁ బూనుము
పెల్లుగఁ బ్రజ్ఞయును శ్రీయుఁ బెంచుము కరుణన్

# శ్వేతాశ్వతరము

[నిత్యశతకము : ౭వ పది]

అరయ నవర్ణుఁడైయు నిహితార్థుఁడు తాల్చును శక్తి యోగని
ర్భరుఁడై యేకమూర్తి బహువర్ణము నంతమునందు సర్వమే
డ్తి భోగయించు నాతఁ డొకఁడే రవిచంద్రులు పంచభూతముల్
నగగ నతండె శుక్రము ప్రజాపతి యాతఁడె బ్రహ్మ మంతటన్

ఆతఁడె పూరుషుండు నలినాక్షుఁడు పుత్రుఁడు పుత్రి యాతఁడే
యాతఁడె వృద్ధుఁడై వణఁకు నాతఁడె పుట్టును విశ్వతోముఖుం
డాతఁడె నీలుఁడై హరితుఁడౌచుఁ బతంగుఁడు లోహితాక్షుఁడై
యాతఁడె మేఘముల్ ఋతువు లంబుధి యాతఁడు కాని దున్నదే

అజ బహుసంతతిం గనెడు నట్టిది లోహిత శుక్ల కృష్ణ సా
మజగమునన్ సరూప జూపమాణుఁ డజుం డొకరుండు దానిభా
వజకృతులందుఁ గ్రిందగుచుఁ బైనగుచుండును భుక్తభోగుఁడై
యజుఁ డొకరుండు దానివిషయమ్ముఁ ద్యజించుఁ బరోక్షకాముఁడై

ఈశుఁడు దేవతాప్రభవహేతువు సంస్థితిహేతు వౌంటను వి
శ్వేశుఁడు రుద్రుఁ డనెడు ఋషి మహేశుఁ డతండు హిరణ్యగర్భులో
కేశుని జాయమానుని వహింపించును దర్శనమాత్ర మాతను డా
నై శుభబుద్ధి ప్రేమ సకలాంగనసంగములఁ గూర్చు గావుతన్

ద్విపద చతుష్పదంబులను దేవతలన్ మఱి యెల్ల లోకముల్
సృజనమొయి నేమహేశుఁడు భరించునొ యొక్కఁడు తాను
సూక్ష్మసూ
క్ష్మపు వెలుఁగొక్కఁడై కలిలమధ్యమునందు ననేకరూపవి
శ్వపుఁ గొలి స్రష్టనన్నియుఁ గనువాని కనంతము శాంతిఁ గాంచెదన్

ఆతఁడె కాలమునందు భువనాళులగత్తు పోషించుచుండుఁ దా
నాతఁడె విశ్వభూతములయందున గూఢత సంచరించుఁ దా
మాతనియందె బ్రహ్మఋషు లందఱు దేవతలున్ వసింత్రు త
జ్జ్ఞాతను మృత్యుపాశముల సంతతియందున ఛేత్తయయ్యెడున్

# మాండూక్యము

( నిత్యశతకము : రవపది )

ఖండ మఖండమై చనిన కాలము సర్వము నోంకృతిప్రథా
మండిత మోంపదార్థమె సమంజసమై చను బ్రహ్మ మాత్మని
త్యుండును నొక్కరుండును చతుష్పదుఁ డాతఁడె సర్వకాలబ్ర
హ్మాండసమస్తకారకుఁ డనాద్యుఁ డనంతుఁ డతండె సర్వగుః

ప్రథమపాదము వైశ్వానరంబు స్థూల
భుక్కు నేకోనవింశతిముఖము సంగ
సప్తకము బహిఃప్రజ్ఞము జాగరితము
స్థానమైనది సర్వమాయాయుతంబు

చను ద్వితీయపాదము తైజసము వివిక్త
భుక్కు నేకోనవింశతిముఖము సంగ
సప్తకమ్ము నంతఃప్రజ్ఞ మాప్తమైన
స్వప్నవీథియె దానికి స్థానభూమి

కముఁ దృతీయము ప్రజ్ఞానఘనము ప్రాజ్ఞ
మొకండు నానందమయము నానందభుక్కు
నోకట్టిఁ డతని సుషుప్తస్థాన మొక్క-కోర్కి-
తూలు స్వప్నము తూలు చేతోముఖుండు

ఆతఁడె సర్వేశ్వరుఁడును
నాతఁడె సర్వజ్ఞుఁ డతఁడె యఖిలప్రభువుం
డాతఁడె యంతర్యామియు
నాతఁడె భూతముల కెల్ల హర్తయుఁ దలఁపన్

ప్రజ్ఞము నాంతరప్రజ్ఞము బాహిరప్ర
జ్ఞము నుభయతఃప్రజ్ఞ కాదు
ప్రజ్ఞేతరంబును బ్రజ్ఞానఘనము కా
దగ్రాహ్య మవ్యవహార్య మగుచు
నది యదృష్ట మ్మచింత్య మ్మలక్షణము న
వ్యపదేశ్య మదియ శివంబు శాంత
మేకాత్మగతప్రత్యయైకసారంబు ప్ర
పంచోపశమము నవంచకంబు

ఇది సమస్థము విక్షే కనియు రూపాత్మ
కడఁగి యధ్యక్షరంబు నోంకార మిద్ది
కళలు నాలు గకారం బుకారమును మ
కార మిట్లర్ధమాత్ర సన్మఖండయు క్రి

అరయ జాగరితస్థాన మది అకార
మరియు వైశ్వానరం బంచు నాప్తివలన
నాదిమత్వమువలనఁ దద్వేది సర్వ
కామములు పొందుఁ బ్రథముఁడై కాంచుఁ బ్రీతను

అరయ రెండు స్వప్నస్థాన మద్ది తైజ
సం బుకారము కర్ష దే సాధు మాత్రి
మరియు నుభయత్వంబు కాన సమానుఁ జేయుచు
బ్రహ్మవిత్కులజుఁడగు స్వప్నవేది

మూఁడవది సుషుప్తస్థానమును మకార
మద్ది ప్రాజ్ఞము మితిచేత నంత్యమగుట
నెవఁడు తద్వేత్త వాఁడు సర్వేశ్వరుండు
సర్వ మాతయు వాఁడె యపీతి వాఁడు

ఒగిఁ జిహ్వాగ్ర శుద్ధి యోంకార సుస్వర
యోగ్య నొక్కఁడు శివము నచ్ఛ మాత్మ
ఆత్మచేతఁ జొచ్చు నాత్మయుం దాతఁడు
నేర్వఁ దెలుఁగు నిద్ది నొర్వఁ దెలుఁగు

# ఈ శా వా స్య ము

[ ని త్య శ త క ము : న వ ప ది ]

ఏది జగంబునం గదలు చింతయు నున్నను నద్ది యీశ్వరా
చ్ఛాదిత, మందుచే జగముఁ బాపఁ బోక భుజింపుమీ!, పర
శ్రీ దొరఁగుంచుకో మనసు చేయకు, వర్షశతాబు జీవితే
చ్ఛాధృతిఁ బూనియుండు మను సంగతకర్మములాచరింపుమా

ఈగతి సంచరించు నరు నింతయుఁ గర్మము తాఁకఁబోవ దీ
నాఁగు గయుంను బద్ధుఁడగు వాఁడెవఁ డాత్మహనుండు వాఁడు మృ
త్యాగ్రగమా వేళ సంఘటనాపాభిధమైన యసుర్యలోకమున్
తాఁ గమనంబు సేయు వితతంబుగ సూర్యసుదివ్యపేతముఁ

మనసున కద్ది పూర్వ మతిమానసవేగము నిత్య మొంటి చా
విని బడి పర్వులెత్తును మనీషయు సర్వము మాతరిశ్వనా
రినిచయ మద్ది యొక్కఁడు భరించుఁ జలాచల మద్ది దూరమం
దున నికటంబునన్ వెలిని దోఁచును లోపలఁ దోఁచు సంతతన్

అఖిలభూతమ్ము లాత్మయందు, నాత్మ యఖిల
భూతములయందుఁ జూచెడు పురుషునకును
లేదు విచికిత్స, కోపమ్ము లేదు, లేదు
శోకమును, సర్వ మొకటిగాఁ జూచు నెడల

అది శుక్రంబు నకాయ మవ్రణము సర్వాంతస్సు నస్నావిరం
బది శుద్ధంబు నపాపవిద్ధము మనీషాస్థాని తా నొక్కఁడు
న్నది సర్వంబును దానయైనది జగన్నానాపతుల్ దానిశ
శ్వదనూనాజ్ఞను సర్వకాలము సమర్ప్యత్వంబు దీపించుచున్

ధీరులనుండి మా కిది శ్రుతివ్యవహారము వచ్చుచుండె వి
ద్యాగతికిన్ ఫలం బొకఁడు నన్య మవిద్యను, రెంటి నేర్చినన్
బేరిమి దాఁటు మృత్యువు నవిద్యను దత్కృతిక న్నవేర్చి వి
ద్యాగుదిరాభిమగ్న నమృతత్వముఁ గాంచు సనాతనస్థితిన్

ధీరులనుండి మా కిది శ్రుతివ్యవహారము వచ్చుచుండె వే
ర్వేరు ఫలాభిసంధి యగు బిట్టు నసంభవసంభవంబులన్
మేరలు దాఁటినొంతయును మృత్యువు దాఁటు నసంభవంబునం
దారిన మాయ నోర్చి యమృతత్వము గాంచును సంభవంబుచే

కదు సత్యాముఖము మూయం
బడియుండె హిరణ్మయంపుఁ బాత్రము చేతన్
గదు దయఁ దెరువుము పూషుఁడ
దడఁబడనీకుండ సత్యధర్మునికొఱకున్

ఇఁక వాయు వనిల మమృతము
పరికటశరీరమ్ము నేఁడు భస్మాంతంబై
యకటా! యేమి పొనర్చితి
వి జ్ఞాయ మప్పుడు స్మరింపవే! యో క్రతువా!

ఓయగ్ని! మంచిత్రోవను
బోవెడు గతి నన్నుఁ గొంచుఁ బో! వక్రింబౌ
నేయఘ్న ముడిగి నీకును
భూయిష్ఠంబు నమఉక్తి పొనరింతుమయా!

